## పాఠకమహాశయులారా !

శ్రీ కపోతేశ్వరచరిత్రం బను సద్గ్రంథంబు నాచే నేఁ డాంధ్ర పద్యకావ్యంబుగఁ వ్రాయబడుట సంప్రాప్తించె. కపోతేశ్వరక్షేత్రం బనాదిసిద్ధంబు. మరియు ఆంధ్రరాష్ట్రంబున గుంటూరుమండలంబున నరసరావుపేట సీమయందుండు చేజర్లగ్రామంబు శ్రీకపోతేశ్వర విరాజితంబు నగుచు మా కనతిదూరంబునం దుండి యున్నది. నేనిదివరలో శ్రీశైలమల్లికార్జున శతకంబుఁ వ్రాసియుండ నది పఠించిన భక్తులు కొందరు మనకు సామీప్య మీ క్షేత్రంబు నీస్థల విశేషంబులను గూర్చి శ్రీ కపోతేశ్వర చరిత్రంబు రచించుమన విని యానందించి మహాభాగ్యంబని వ్రాసితిని.

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః
సుకృతం దుష్కృతం చైవ చత్వార స్సమభాగినః.

అనెడార్యోక్తిఁ శ్రీ పొత్తూరి రామచంద్రరావుగారు మా గ్రామవాసులును నా కాశ్రయులును మాతృ స్మృతికారణంబుగా నీశ్వరానుగ్రహంబు నొందం దలంచి యీ గ్రంథముద్రణార్థం బప్రయత్నంబుగా నామోదించి కావ్యముద్రణ ప్రకాశకు లైరి.

శ్లో॥ దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వ ముచితజ్ఞతా
అభ్యాసేన నలభ్యంతే చత్వార స్సహజా గుణాః.

అనినట్లు పూర్వపుణ్యవిశేషంబునఁ వీరి కీ వితరణగుణంబు సంసిద్ధంబై యొప్పిదంబయ్యె. ఇట్టి సత్పురుషులగు శ్రీరామచంద్రరావు గారికి శ్రీ కపోతేశ్వరుం డనుగ్రహించి ఆయురారోగ్య సత్సంతానైశ్వర్యంబు లచిరకాలంబులో నొసంగి రక్షించుట సత్యంబు, సత్యంబు, సత్యంబు. ఈశ్వరానుగ్రహం బనేకజన్మసంసిద్ధంబు, దుర్లభంబు నైనను వీరికి సులభసాధ్యంబై విరాజిల్లినది.

ఇట్లు,
భక్తవిధేయుడు
పమిడి రామజోగయ్యశాస్త్రి
గ్రంథకర్త

# శ్రీ కపోతేశ్వర చరిత్రము

## పూర్వభాగము

---

### ఈశ్వర స్తుతి

శా. శ్రీ కైలాసవిహార సాంబ భవదం ♦ ఘ్రిద్వంద్వపంకేజముల్
శ్రీ కళ్యాణనికేతనంబు లనుచుఁ ♦ చిత్తంబులో నమ్మి నే
నీ కావ్యంబును వ్రాయబూనితి దగఁ ♦ నూనంబులేకుండగఁ
నీ కారుణ్యముతోడ నింపగునటుల్ ♦ నిర్మింతు నఁబ్రోవుమీ. 1

### పరదేవతా స్తుతి

శా. శ్రీమాతా సురపూజితాంఘ్రియుగళా ♦ శ్రీకంఠచిత్తప్రియా
సామోదంబున భావయుక్తకవితా ♦ సాహిత్యముఁ నీ కృపా
సామర్థ్యంబున గూర్చి నా కొసగుమీ ♦ సద్భక్తితో మ్రొక్కెదఁ
నామాటల్ విను మంబికా గిరిసుతా ♦ నాతల్లిరో ! బిడ్డడఁ. 2

### వినాయక స్తుతి

శా. భూనాథుఁ భజియింప భూముల నిడుఁ ♦ బొల్పొంద నర్థేశుడుఁ
నానా కాంచనభూషణాదుల నిడుఁ ♦ నైపుణ్య మొప్పఁ భువిఁ
నే నా విఘ్నవిభుఁ భజింప కృతికిఁ ♦ నిర్విఘ్నముఁ గోరుచుఁ
సానందంబున వేనవేలునతులఁ ♦ సద్భక్తితో సల్పెదఁ. 3

### హనుమన్నుతి

మ. స్థిరభక్తిఁ రఘురాముగొల్చి జలరా ♦ శిఁ దాటి లంకాపురిఁ
పరిశోధించి ధరాసుతఁ గనియు స ♦ ద్భక్తిఁ విజృంభించియుఁ
ధరణీవల్లభు రామభద్రు పలుకుల్ ♦ తథ్యంబులం చెన్ను నీ
వరసద్రూపము గొల్తు వాయుతనయా ♦ వాక్సిద్ధి కశ్రాంతముఁ. 4

## సుకవిస్తుతి - కుకవి నిరసనము

కం. కాలత్రయములయందుఁ
మేలుగ వెలుగొందు సుకవి ♦ మృత్యుంజయులఁ
వాలిన భక్తి నుతింతును
లీలఁ కుకవిమృగతతిని ♦ లెక్కింప మదిఁ. 5

## శివపంచాయతన స్తుతి

గీ. విష్ణుమూర్తి విఘ్నేశ్వర ♦ విశ్వనయన
విశ్వనాథ విశ్వేశ్వరీ ♦ విబుధవరుల
వివిధవిధముల పూజింతు ♦ వినతిజేతు
విపుల విజ్ఞాన సంపదల్ ♦ వెలయుకొరకు. 6

## గౌరీపంచాక్షరీ స్తుతి

(షట్పదగీతము)

శ్రీమదింద్రనీలమణి రుచినిభతనువు
శిశిర పూర్ణచంద్ర నిభంబు జెలగుమోము
వాసిగల వస్త్వలంకార భాసురాంగ
యై జగన్మంగళాకార యై స్వభక్త
నవనవస్తోత్ర సంతోష వివశయగుచు
మోక్షసిరులిచ్చు గౌరికి మ్రొక్కులిడుదు. 7

చం. అను చిటు లిష్టదైవముల ♦ కంజలిజేసి కవీశ్వరస్తుతిఁ
ఘనముగజేసి దుష్కవి ని ♦ కాయవికాసము లెక్కజేయకఁ
వినుతిగ నాదుపూర్వుల సు ♦ వృత్త మశేషము జెప్పబూను నఁ
గనుగొని కావ్యముద్రణము ♦ ఖ్యాతిగజేతుమటన్న మున్ను నేఁ 8

వ. శ్రీకపోతేశ్వరచరితంబు రచియింతునని తలంచి శక్తి నాలోకించి
చాలదని వితర్కించి "కిం దుష్కృతం శంకరకింకరాణా"
మనె డార్యోక్తిఁ స్మరించి కావ్యరచనకుఁ బ్రయత్నించితి
మరియు నందు, 9

## కవి వంశాభ్యుదయ వర్ణనము

కం. భువి కౌండిన్యకుల సము
ద్భవ సుగుణుడు విశ్వనాథ ♦ ధరణీ సురుడుఁ
ధవుడుఁ పిచ్చమసతికిఁ
స్తవనీయులు వారు నాదు ♦ జననికి జనకుల్. 10

సీ. కౌశికగోత్ర దు ♦ గ్ధసముద్ర చంద్రుండు
జ్ఞానావధాని వి ♦ జ్ఞానపరుడు
తనయుండు వారికి ♦ తత్త్వశాస్త్రవిదుండు
నారాయణాఖ్యుండు ♦ నైష్ఠికుండు
వేదశాస్త్రార్థ స ♦ ద్విదుడు చిదంబర
నామధేయుడు వాని ♦ నందనుండు
సంస్కృతాంధ్రములందు ♦ సంపూర్ణ విజ్ఞాని
సుబ్బయాఖ్యుడు వాని ♦ సూనుడయ్యె.

గీ. నట్టి సుబ్బయాభిఖ్యున ♦ కర్ధతనువు
నగు మహాలక్ష్మమాంబకు ♦ నాత్మజుండ
కృష్ణనామాగ్రజన్ముని ♦ కృపను బెరిగి
జాయగ సరస్వతీనామ ♦ సతియు గల్గి. 11

కం. సామజచర్మాంబరధరు
సోముని భక్తుండ రామ ♦ జోగయశాస్త్రి
నామము గల్గియు శంకరు
నేమరకఁ నమ్మియుంటి ♦ నేలెడు విభుగాఁ. 12

కం. శ్రీగిరి కీశాన్యంబున
బాగుగ ముప్పాళ్ళపురము ♦ భాసిలుచుండుఁ
నాగాభరణుని సత్కృప
నే గరిమఁ నిలుతు నచట ♦ నిర్మల ధృతితోఁ. 13

## ముద్రణాభ్యుదయకారణము

గీ. ముద్రణాభ్యుదయంబును ♦ భద్రముగను
కోరి చేయు సుజనులను ♦ గూర్చు మనుచు
జిత్తమందు శివుని గూర్చి ♦ చింతనజేయు
నాకు నీరామచంద్రయ ♦ వా కొసంగె. 14

కం. వినుతుడు కౌండిన్యాన్వయ
వననిధిశశి రామచంద్ర ♦ వసుధామరు డీ
యన తలిదండ్రులు రామమ
యును వేద్రాదియు ననుచు సు ♦ యోగ్యులు బలుకఁ. 15

ఉ. రామమనామముఁ గలిగి ♦ రాజిలుతల్లి సుసద్గుణాఢ్యయై
క్షేమముగోరి బెంచినది క్షేత్రము ♦ లర్థము లిచ్చి విద్యలఁ
ప్రేమజనింప దీర్చినది ♦ భేదములేకను కన్నబిడ్డలఁ
ధామము వీడె నేడు శివ ♦ ధామమొసంగుము రాజశేఖరా. 16

కం. కలి నేబదివందల పై
దెలియగ నేబదియునాల్గు ♦ దేలినపిదపఁ
లలితవిజయాఖ్య వత్సర
కలితాశ్వయుజ కృష్ణపక్ష ♦ గత దశమితిథిఁ. 17

కం. తత్తరపాటుఁ లేకను
పెత్తనమున బండు బండి ♦ పృథ్విఁ రాలెఁ
పొత్తూరి రామమాంబకు
నిత్తరి సాటెన్ను సతులు ♦ నిలలో గలరే. 18

కం. తల్లిగతికి జింతింపుచు
నుల్లములో రామచంద్ర ♦ యోత్తమబుద్ధిఁ
చెల్లెడు మాటలు నాతో
తెల్లముగా బలికె సాంబ ♦ తిలకించి వినఁ. 19

చం. సమయమెఱింగి సాంబశివ ♦ సంతసమొందుచు రామచంద్ర రా
వమృత వచోభిరాముడు ప్ర ♦ యత్నమొనర్చుచు మాతృముక్తికిఁ
సమకొను కారణంబు విన చక్కఁగ ♦ బల్కుమటన్న నచ్చునఁ
తమరు కపోతలింగచరి ♦ తంబు సుముద్రణసల్పు మంటి నేఁ. 20

కం. శ్రీ రామచంద్రరావు స
తీ రత్నము సీతమయును ♦ స్థిరమతు లగుచుఁ
శ్రీరాములు సీతయు మును
ధారుణి గన్నట్టి యశము ♦ దగనొప్పిరిలఁ. 21

కం. వినయభరితులగు తనయులు
తనుజలును గలిగి సతతము ♦ ధరను సుఖింపఁ
వనధర ! వరములనిడు మీ
మనసొప్పఁ రామచంద్ర ♦ మంత్రి నుతింపఁ. 22

చం. వినుతిగ కట్నకానుకలు ♦ విశ్వహితంబుగ నిచ్చు నీతడుఁ
వినుతిగ గావ్యకన్యకను విశ్వ ♦ హితంబుగ నేను నిచ్చెదఁ
వనధర ! కావ్యకన్యకను ♦ వాంఛలుదీర భరింపు మిత్తరిఁ
మనుచుము భోగ్యభాగ్యములు ♦ మాకిడి శీఘ్రము చంద్రశేఖరా!

చం. వినుతయశస్కులగ్రజులు ♦ విశ్వమునందున సుప్రసిద్ధులై
గనుగొన సోదరీమణులు ♦ కంజదళాక్షుని పత్నితుల్యులై
మన, గన రామచంద్రయస ♦ మంచితబంధువు లందరుఁ ముదం
బనువుగ జెంద శంకర ప్ర ♦ పూర్ణకృపఁ దగ నేలు మంచనఁ. 24

గీ. హరు డనుమతించె నచ్చున ♦ కానుకూల్య
చరుడు నయ్యె సుమతి రాను ♦ చంద్రరావు
సురుచిరముగ గపోతేశు ♦ చరిత రచన
సరగున సమకూర్తు నిపుడు ♦ సరసగతిని. 25

## కావ్యరచన కీశ్వరుండు అనుగ్రహించుట

గీ. రోజు లొక కొన్ని గడచెను ♦ రాజితముగ
రాజశేఖరు సేవ సు ♦ రక్షణంబు
గల్గియుండంగ నా కింక ♦ గావ్యరచన
ఫలము సిద్ధింపకుండునే ♦ భవునికృపను. 1

వ. అను చిట్లు కృతనిశ్చయస్వాంతుండనై యుండునంత నొక్క పుణ్య
దివసంబునందు, 2

గీ. కాలహరణంబు గన్గొని ♦ కరుణ వెలయ
గరళకంఠుండు సర్వమం ♦ గళను గూడి
స్వప్నమందున గనుపించి ♦ సత్వరముగ
శ్రీ కపోతేశ్వరచరిత్ర ♦ జెప్పుమనియె. 3

గీ. స్వప్నమున నేను సంతోష ♦ వార్ధి మునిగి
పరవశంబున నానంద ♦ బాష్ప ముబ్బి
కనులజారంగ పాదము ♦ ల్గడిగి పూజ
సల్ప ధన్యుండవగుమని ♦ జనిరి వారు. 4

గీ. అంతలో మేల్కనియు నేను ♦ సంతసించి
లోకజనకు లుమేశులు ♦ లోటులేని
దివ్యదర్శన మిచ్చి య ♦ దృశ్యులైరి
వారి యాజ్ఞానుసారంబు ♦ గోరి చేతు. 5

వ. అని నిశ్చయించి ఇక్కవితాకన్నియ నీశ్వరున కర్పించి ధన్యుండ
నగుదునని మనంబునఁ దలంచు నంతలో క్షణకాలంబు
మైమరచి దన్మయుండనైతి. అట్టి సమయంబునందు దివ్యాంగ
రాగప్రభల నొప్పి దివ్యసుందరమూర్తి త్రిశూలడమరుకాది విశేషం
బులు హస్తంబుల నలరుచుండ బార్వతీసహితుండై కనక మణి
మయసింహాసనంబునందు జగన్మంగళరూపంబున గనుపింపఁ
గాంచి, 6

## షష్ఠ్యంతములు

కం. హిమగిరి తనయావరునకు
కమలదళనయన సఖునకు ♦ కరకంఠునకున్
హిమకరధరునకు హరునకు
కమనీయవిభూతి కాంతి ♦ కలితాంగునకున్. 7

కం. శ్రీమత్కపోతవిభునకు
కామితఫలదాయకునకు ♦ కామేశునకున్
భూమిన్ చేజర్లనిలయ
సామజచర్మాంబరధర ♦ సాంబశివునకున్. 8

కం. నిగమాతీతస్తుతునకు
జగదాధారునకు సాధు ♦ జనపాలునకున్
భగవద్గుణ భూషణునకు
నగణితమహిమాన్వితునకు ♦ నంజలు లిడుచున్ 9

గీ. సాంబ! నీ విట్లు చరితంబు ♦ సల్పుమన్న
బతివి నీవంచు సంతోష ♦ బడుచు నేను
కవన కన్యను నీకిత్తు ♦ కరుణ గొనుము
అందచందంబు లొప్పెడి ♦ సుందరాంగి. 10

వ. సఫలమనోరథుండ వగుమను చంతర్హితుండయ్యె నంత నేను మేల్కాంచి సంతసించి కథారచనకు బ్రయత్నించి ధ్యాననిష్ఠయం దున్న నా కీశ్వరుండు మరల సాక్షాత్కరించిన నేను నమస్కరించి వినుతించి మనవిజేయ, గరుణించి సుబోధంబులగు సమాధానంబు లొసగుదు నన, నే నిట్లు వచించితి. 11

గీ. పారమించుకలేని సం ♦ సార జలధి
మధ్యను మునుగునా కిప్డు ♦ మను టికెట్లు ?
నాదు పదసేవ దాటించు ♦ నౌక నీకు
వసతిగానుంఠ భయమేమి ♦ వత్స ! చెప్పుమ. 12

గీ. బద్ధు డెవ్వండు ? విషయ సం ♦ పర్కరతుడు
ముక్తు డెవ్వండు ? విషయ వి ♦ రక్తిపరుడు
దారుణ నరకమన నేది ? ♦ తనదు తనువు
త్రిదశనిలయ మనగ నేది ? ♦ తృషను విడుపు. 13

గీ. భవహరంబెద్ది ? వేదాంత ♦ పదవి గనుట
ముక్తికారణమగు నెద్ది ? ♦ యుక్తి యడియె
నరకముఖ్యకవాట మె ? ♦ ద్దరయ రమణి
నాక మిడు జీవులకు నెద్ది ? ♦ న మ్మహింస. 14

గీ. సుఖసుషుప్తుం డెవడు ? చిత్త ♦ శుద్ధియుతుడు
నెవడు మేల్కను ? సదసత్తు ♦ లెరుగుసతడు
నేవి శత్రువులగును ? ని ♦ జేంద్రియములు
నేవి మిత్రులు నగును ? జి ♦ తేంద్రియములు. 15

గీ. ఎవ్వడు దరిద్రుడు ? డత్యాశ ♦ నేగువాడు
ధనికు డెవ్వండు ? నిత్యముఁ ♦ దనియువాడు
బ్రతికి జచ్చు నెవడు ? విచా ♦ రరహితుండు
నేది యమృతమగు ? నిరాశ ♦ నిచ్చు సుఖము. 16

గీ. ఎద్ది యురిత్రాడు ? నేను నా ♦ దేది యనుట
నెద్ది మధుభంగి వలపిడు ? ♦ నింతి సుమ్ము
నెవ్వ డంధుండు ? కాముకుం ♦ డెంచిచూడు
మృత్యువన నెద్ది ? యపకీర్తి ♦ మిత్ర తనదు. 17

గీ. దేశికుం డెవ్వడు ? హితోప ♦ దేశకుండు
శిష్యుడెవ్వండు ? గురుభక్తి ♦ శీలయుతుడు
దీర్ఘరోగమెద్ది ? భవము ♦ ధీరహృదయ
యెద్ది దాని కౌషధమౌను ? ♦ విద్దెయంద్రుడు. 18

గీ. మంచిసొమ్మనబడు నెద్ది? ♦ మంచినడత
మంచితీర్థం బెద్ది? తనదు ♦ మంచిమనసు
వదలదగిన దెద్ది? ధనము ♦ వనిత యగును
వినదగిన దెద్ది? గురుబోధ ♦ వేదవాక్కు. 19

గీ. బ్రహ్మగతి కారణములెవ్వి ♦ ప్రబలుచుండు?
సాధుసంగ దాన విచార ♦ సంతసములు
వేద్యు లెవరు గలరు? రాగ ♦ విగతమతులు
మోహరహితులు శివతత్త్వ ♦ ముఖ్యరతులు. 20

గీ. జీవులకు నెద్ది విషమౌను? ♦ చింతబడుట
మూర్ఖుడన నెవడు? వివేక ♦ ముడుగు నతడు
నెద్ది ప్రియకార్యమౌ రమే ♦ శేశసేవ
జీవనం బెద్ది? పాప వ ♦ ర్జితము వినుము. 21

గీ. చదువనగ నెద్ది? బ్రహ్మను ♦ షంగదంబు
జ్ఞాన మేది? ముక్తికి హేతు ♦ వైనదగును
లాభ మెద్ది? బ్రహ్మైక్యమే ♦ లాభమౌను
జగ మెవడు జయించు? మనోవి ♦ జయయుతుండు. 22

గీ. శూరముఖ్యు డెవడు? కామ ♦ దారుణాస్త్ర
బాధనొందకుండు నతడు, ♦ ప్రాజ్ఞుడనగ
ధీరుడనగ సముండన ♦ దెలియ నెవడు?
స్త్రీ కటాక్ష మోహరహిత ♦ చిత్తయుతుడు. 23

గీ. విషమునఁ గొప్ప విషమేది? ♦ విషయతతియె
విడని దుఃఖమొందు నెవడు? ♦ విషయరతుడు
నుర్వి పుణ్యాత్ము డెవడు? లో ♦ కోపకారి
పూజితవ్యు డెవడు? తత్త్వ ♦ పూర్ణరతుడు. 24

గీ. ఏ యవస్థయందును జేయ ♦ నెద్ది తగదు?
విద్యగలవాడు సాధించు ♦ విధ మదెద్ది?
పాపసహవాసమును, ధర్మ ♦ పఠన పథము
సంసృతికి మూలమౌనెద్ది? ♦ స్వగతచింత. 25

గీ. ఉత్తమజ్ఞాని యెవఁడగు ♦ నుర్వియందు ?
స్త్రీపిశాచ వంచనలకు ♦ జిక్క నతఁడు
ప్రాణులకు సంకె లన నెద్ది? ♦ రమణియగును
మహిని దివ్యవ్రత మదెద్ది ? ♦ మార్దవంబు. 26

గీ. సంగసహవాస మెందెందు ♦ జరుపరాదు ?
మూర్ఖ ఖల నీచ పాప స ♦ మూహములను
త్వరితగతి ముముక్షులకు నెద్ది ♦ జరుపనగును ?
నిరభిమానేశభక్తి, స ♦ త్పురుష గోష్ఠి. 27

గీ. సర్వులకు నెద్ది దెలియ న ♦ శక్యమగును ?
యువతుల మనంబు జరితంబు ♦ యుక్తమతము
సకలజను లెద్ది విడలే ? ర ♦ ధిక దురాశ
పశువన నెవండు ? జదువకఁ ♦ బశువునగును. 28

గీ. చులుక నెప్పుడౌ ? యాచించు ♦ చుండు నపుడు
గౌరవం బెప్డు ? యాచింప ♦ కుండు నపుడు
పుటుక మంచి దెప్డు ? మరల ♦ బుట్టనపుడు
జావు మంచి దెప్డు ? మరల ♦ జావనపుడు. 29

గీ. ఎవడు మూగ యౌను ? బధిరు ♦ డెవ్వడౌను ?
జెప్పదగినట్టి మాటను ♦ జెప్పనతడు,
సత్యహితవాక్కులఁ విన ♦ జాల నతడు
నెద్ది విశ్వసింపనయోగ్య ? ♦ మింతియగును. 30

గీ. తత్త్వ మొకటెద్ది ? ఘనశివా ♦ ద్వైతమగున
దుత్తమం బెద్ది ? సచ్చరి ♦ తోత్తమంబు
విడువదగు ముఖ్య సుఖ మెద్ది ? ♦ వినుము వనిత
యెద్ది ముఖ్యదాన ? మభయ ♦ మెల్లవేళ. 31

గీ. శత్రువందు మహత్తర ♦ శత్రు వెద్ది ?
అనృత కుపిత పిశున తృషఁ ♦ దనరు తలపు
నెద్ది విషయతృప్తి గనలే ? ♦ దెరుగు మదియె
మఱియు శోకమూలము నెద్ది ? ♦ మమత సుమ్ము. 32

గీ. భూషణంబేది మోముకు ? ♦ భాషణంబు
భువిని నిజమెద్ది ? సతతంబు ♦ భూతహితము
కృత్యమెద్ది జేసి మది దుః ♦ ఖింప దగదు ?
శివజనార్దనులను బూజ ♦ జేసినపుడు. 33

గీ. హృదయలయ మెందు ? మోక్ష స ♦ త్పదమునందు
భయములేని దెచట ? ముక్తి ♦ పదవియందు
పరశరం బెద్ది ? మౌర్ఖ్యంపు ♦ బట్టు తనది
పూజ్యు లెవ రెవరు ? గురువి ♦ బుధులు బుధులు. 34

గీ. ప్రాణహరుడు యముడు వచ్చి ♦ రమ్మటన్న
శీఘ్రయత్న మెద్ది సుమతి ♦ జేయనగును ?
జిత్త వాక్కాయములచేత ♦ శివదకాల
జి ద్ధరిచరణ పంకజ ♦ చింతనంబు. 35

గీ. దస్యులెవరు ? దుర్గంధాభి ♦ ధాను లంద్రు
సభ నెవండు కాంతిగనును ? ♦ సద్విదుండు
తల్లివలె సుఖ మిడు నెద్ది ? ♦ తనదు జదువు
దానమిడ బెరుగున దెద్ది ? ♦ తనదు జదువు. 36

గీ. ఎందును భయ మెల్లపు ♦ డును బొందవలెను ?
భువవన నిందకు భవన ♦ నివసనమున
కెవడు ముఖ్యబంధువు ? తండ్రు ♦ లెవరు గలరు ?
కష్ట సహకారి, పోషింప ♦ గలుగువారు. 37

గీ. కొరతరాదు దెలియ నెద్ది? ♦ భూరి సుఖద
రూప శివుని ప్రసాదంబు ♦ రూఢి దెలియ
దెలియ నెద్ది జగంబంత ♦ దెలియుచుండు ?
పూర్ణమౌ బ్రహ్మతత్త్వంబు ♦ బోధ దెలియ. 38

గీ. ఎద్ది దుర్లభ్యమౌ భువి ? ♦ నెవరు గురువు ?
సజ్జనులమైత్రి, బ్రహ్మవి ♦ చారణమున
సర్వమును వీడు శివతత్త్వ ♦ సద్రతుండు.
సర్వులకు దుర్జయు డెవడు? ♦ స్మరు డొకండు. 39

గీ. పశువుకంటె మహత్తర? ♦ పశు వెవండు?
శాస్త్ర మెరిగి తెలివి చవి ♦ సొంత ముడుగు
పాపరతుడు, నెద్దమృతము ♦ పాటివిస? మ
తివ, యెవడు మిత్ర తుల్యారి? ♦ దెలియ సుతుడు. 40

గీ. ఎద్ది విద్యుచ్చలము? నాయు ♦ వీడు సొమ్ము
దానయోగ్య మెద్ది? సుపాత్ర ♦ దాన మౌను
కంఠగతమైన ప్రాణముల్? ♦ గార్యమె? ద్ద
కార్య మెద్ది? శివనుతియు, ♦ గడిది పనియు. 41

గీ. అహరహంబును చింతన ♦ కర్హ మెద్ది?
శివుడు నిజమటంచు భవము ♦ జెడునటనుము
కమలనయనున కింపగు ♦ కార్య మెద్ది?
సంస్కృతిని నమ్మరాదు ని ♦ జంబుగాను. 42

గీ. కంఠగతమునైన శ్రవణ ♦ గతమునైన
హరిహరుల కథలవలెను ♦ బరమ ముదము
మాన్యులకు నిచ్చు మణిరత్న ♦ మాల నిదియు
జదువ బ్రశ్నోత్తరాఖ్యంబు ♦ సౌఖ్యమిడును. 43

కం. శంకర! నిన్ ధ్యానించితి
పంకముగా నీవు జెప్పు! ♦ బోధన్ వింటిన్
మంకు విడి తెల్వి గల్గెను
సంకల్పింతున్ గృతికిని ♦ జన్మ తరింపన్. 44



# కథా ప్రారంభము

గీ. వ్యాసరచితంబు వినుత కా ♦ వ్యాంతరంబు
శిబినృపాలుని చరితంబు ♦ శ్రీ కపోత
లింగమహిమంబు వినగ దె ♦ ల్పెద దెలుగున
గ్రంథరచనంబు జేసిన ♦ గ్రమయుతంబు. 45

గీ. నైమిశారణ్యవాసులు ♦ న్యాయధర్మ
నిధులు శౌనకాదిఋషులు ♦ నియతితోడ
సత్రయాగంబు జేయ నా ♦ సన్నుడైన
సూతపౌరాణికుని జూచి ♦ శుభము లడిగి 46

గీ. సూత! సర్వజ్ఞుడవు నీవు ♦ మా తలంపు
వినుము సర్వ పురాణముల్ ♦ వేల్పులందు
శంకరునివంటి దైవంబు ♦ జగములందు
లేడనుచు జెప్ప వింటి మా ♦ జాడ నిపుడు. 47

గీ. శిబిచరిత్రము జిత్రంబు ♦ జెప్ప విన్న
తనివిదీరదు మాకు సూ ♦ తమునివర్య!
భువిని శిబిచక్రవర్తి స ♦ త్పుణ్యమూర్తి
హరుని కృపకు బాత్రు డెటులొ ♦ యానతిమ్ము. 48

వ. అన విని సూతపౌరాణికుం డిటు లనియె. 49

## శ్రీ కపోతేశ్వర మహిమాభివర్ణనము

సీ. బహువృద్ధులైయున్న ♦ బ్రహ్మణ్య ఋషిగణ
పరివృతుండగు వాడు ♦ బాలకుండు
మునిభావమున నర్థ ♦ మును బ్రకటనజేయు
బరమాత్మభావంబు ♦ బ్రబలువాడు
వేదార్థవివరంబు ♦ వెలిబుచ్చువాడును
జిన్ముద్ర ధరియించి ♦ జెప్పువాడు
సంతోషరూపుండు ♦ స్వాత్మవిహారుండు
హసితముఖుడు మనో ♦ హరుడు హరుడు.

గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జేజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 50

సీ. స్వస్వభావము మఱు ♦ వబడు జగమును ద
ర్పణమున గను నగ ♦ రంబు రీతి
తనయందు నెవ్వండు ♦ దర్శించు నిద్రచే
స్వప్నసాక్షాత్కార ♦ జగము భంగి
మాయచే వెలుపల ♦ జాయమాన మనుచు
గనుచు ప్రబోధించు ♦ గాలమందు
ద్వంద్వరహితుడైన ♦ దనను జూచు నతండు
దివ్యబోధానంద ♦ దేవు డిపుడు.
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జేజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 51

సీ. విత్తులో మొలకుండు ♦ విధమున విశ్వంబు
నిర్వికల్పంబు నై ♦ నిలచు మొదట
మరలను నదియును ♦ మాయచే గల్పించు
దేశకాలముల పాం ♦ దికను బొంది
చిత్రచిత్రంబుల ♦ చిత్రింపబడుచుండ
నదియంత వికసింప ♦ నెవడు జేయు
మాయావియోగుల ♦ మాడ్కిని స్వేచ్ఛతో
మహిమ వెలయుచుండ ♦ మనుచు నతడు
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జేజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగ రూపంబు ధరియించె ♦ నంగజారి. 52

సీ. ఎవని సద్రూపక ♦ ప్రవిమలచైతన్య
మసదాత్మకములైన ♦ యాకసంబు
మొదలుగాగల భూత ♦ ములు నైదునైనట్లు
భాసిల్లుచుండు వి ♦ కాసమొంది
'తత్త్వమసి'యను వే ♦ ద వచన బోధను
భక్తులముందుండి ♦ బల్కు నెవడు
నెవని దర్శనమైన ♦ భవసింధువును దాటి
యలరారి ముక్తులౌ ♦ నట్టి శివుడు
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జేజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 53

సీ. బహురంధ్రఘటమునం ♦ బ్రబలకాంతుల నొప్పు
దీపంబువలె నుండి ♦ దేహమందు
నెవ్వని జ్ఞానంబు ♦ నివ్వటిల్లుచునుండు
జక్షురాదులనుండి ♦ సాగి వెలికి
తెలిసికొంటినటన్న ♦ దెలివి కాధారమై
తేజరిల్లెడు వాని ♦ దేజముననె
జగ మిదంతయు గాంచ ♦ స్థగితమై తేజరి
ల్లుచునుండు నట్టి వే ♦ లుపు బశుపతి
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తినిడుచు
భువిని జేజర్లపురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 54

సీ. పరమాత్మ గొందరు ♦ ప్రాణంబు దేహంబు
చంచలబుద్ధియు ♦ సర్వశూన్య
మనియు సకల విష ♦ యంబులంచు దలచు
చుందురు భ్రాంతులై ♦ మందమతులు

వాదనారతులు స్త్రీ ♦ బాలాంధ జడ సమ
త్వము నొందు వారును ♦ దారి గనరు
మాయామహాశక్తి ♦ మహిమోపకల్పిత
వ్యామోహమును ద్రుంచు ♦ హరుడు నేడు
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జేజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 55

సీ. తమముచేగ్రస్తమౌ ♦ తరణిచంద్రుల పోల్కి
మాయాసమాచ్ఛాద ♦ మగ్నుడగుచు
నిద్రించునప్పుడు ♦ నిఖిలేంద్రియంబులు
వ్యాపారశూన్యమై ♦ యణగియుండ
సన్మాత్రుడగుచుండు ♦ సర్వంబు గుర్తించి
మేలుకోలును బొంది ♦ మెలగునపుడు
మున్ను నిద్రించినా ♦ నన్నట్టి ప్రత్యభి
జ్ఞానమొందుచునున్న ♦ జ్ఞానమూర్తి
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జేజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీకపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 56

సీ. బాల్యంబు తరుణంబు ♦ వార్ధక్యములయందు
జాగ్రత్ నిద్రను ♦ స్వప్నమందు
సకలస్థితుల యందు ♦ స్వాంతవృత్తుల యందు
ననుసరించుచునుండి ♦ యంతరమున
సతతంబు వెలుగొందు ♦ జైతన్యమును నేను
భద్రముద్రను బూని ♦ భక్తులార
కన్పింతు మీయందు ♦ గారుణ్యమును బొంది
యనుచు బ్రకటనంబు ♦ హరుడు జేసి

గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జెజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 57

సీ. మాయాపరిభ్రాంత ♦ మనుజుండు జీవ భా
వము నొంది జాగ్రతఁ ♦ స్వప్నమందు
విశ్వంబు జూచును ♦ వేరగుచున్నట్లు
కార్యకారణభావ ♦ కలిత మనుచు
సేవకుల్ సేవ్యులుఁ ♦ శిష్యులుఁ గురువులుఁ
దనయులుఁ దండ్రులుఁ ♦ దనరు ననుచు
బ్రహ్మసాక్షాత్కార ♦ ఫలము జేకూరిన
నిర్ద్వంద్వపరుడునై ♦ నిజ మతండు
గీ. భక్తకల్పద్రుమంబునై ♦ ముక్తి నిడుచు
భువిని జెజర్ల పురమందు ♦ బొలుపుమీర
శ్రీ కపోతేశ్వరు డటంచు ♦ జెంది పేరు
లింగరూపంబు ధరియించె ♦ నంగజారి. 58

మ. భువి జెజర్ల గపోతలింగ మహిమం ♦ బుఁ బూర్వ మింపొంద వి
న్న విధానంబున మౌనులార! వినగఁ ♦ నానేర్పు చందంబు తో
డ వచింతుఁ శిబిచక్రవర్తి సలిపెఁ ♦ డంబంబు లేకుండగఁ
శివసంప్రీతిగ నశ్వమేధశతముఁ ♦ సిద్ధింప నిచ్చోటునఁ. 59

వ. అంత మరియు సూతుండు ఋషులఁ జూచి యిట్లు వచించె. 60

## చేజర్లపుర వర్ణనము

సీ. షడృతు ధర్మంబు ♦ సఫలమై యొప్పుచు
జెజర్ల పురవర ♦ సీమలోన
ఫల పుష్ప తృణ జల ♦ పర్ణ సమృద్ధంబు
జెజర్ల పురవర ♦ సీమలోన

ధన ధాన్య పశు భృత్య ♦ తనయులు గలయిండ్లు
జేజర్ల పురవర ♦ సీమలోన
నగ వన తరు లతల్ ♦ సొగసుగా నుండియు
జేజర్ల పురవర ♦ సీమలోన
గీ. జెప్ప నొప్పారు చుండును ♦ స్థిరముగాను
నట్టి జేజర్ల పురమునం ♦ దగ్రజాతి
మొదలుగా గల వర్ణజుల్ ♦ మోదమొంది
ధర్మవర్తనులైయుండ ♦ దత్పురమున. 61

## శిబిరాజు చేజర్లకువచ్చి ధ్యానంబు జేయుట

సీ. ఈశ్వరార్పణమంచు ♦ నశ్వమేధశతంబు
శిబిరాజు భువిలోన ♦ జేయుచుండె
జనకు డుశీనర ♦ జనపాలు డీతని
తల్లి మాధవి భార్య ♦ ధన్యకాంత
వృషదర్ప కేక సు ♦ వీర మద్రులు సుతుల్
గలవాడునై యున్న ♦ ఘనకుటుంబి
యై యుశీనరదేశ ♦ మందుండి రాజ్యంబు
బాలించి చేజర్ల ♦ పురమునందు
గీ. నధిక సైన్యసమేతుడై ♦ యందమలర
నందు గోటగట్టి వసించి ♦ యజ్ఞ మచట
సల్పుచున్నవా డర్థులు ♦ సంతసింప
త్యాగియై దానమిచ్చుచు ♦ ధర్మరతిని. 62

సీ. హరిహరబ్రహ్మదు ♦ లానందమును జెంద
నార్తుల రక్షించు ♦ నభయదాత
బ్రహ్మార్పణంబుగ ♦ బ్రజ్ఞానమునుగల్గి
శతహయమేధముల్ ♦ సల్పు యాజి
సకలభూతములందు ♦ సమహితత్వంబున
దానధర్మములిచ్చి ♦ తనువు త్యాగి

దేవ భూదేవ గో ♦ తృప్తి జెందెడునట్లు
సద్భక్తి బూజించు ♦ సదమలుండు
గీ. నగుచు శిబిచక్రవర్తి య ♦ హర్నిశంబు
రాజ్యమేలును బ్రజలను ♦ రక్షణంబు
జేయుచుండును జెజర్ల ♦ జేరి మించి
కోటిసైన్యంబుతో గూడి ♦ గోటయందు. 63

సీ. చెరువులు వేయించి ♦ శివమందిరార్గట్టి
సద్భక్తి భోగముల్ ♦ జరుపువాడు
సద్బ్రాహ్మణకుటుంబ ♦ సంఘముల్ బోషణ
సత్పాత్రులని జేయు ♦ సజ్జనుండు
నిక్షేపధనములు ♦ నిర్మించు బావులు
గల్పించు వనములు ♦ గల సుబుద్ధి
సత్క్రతు లెన్నియో ♦ సరసులచే బొంది
సప్తసంతానముల్ ♦ సంతరించి
గీ. దీనజనులను బోషించు ♦ దిక్కు నౌచు
దేశదేశంబులందుండి ♦ తెచ్చునట్టి
కప్పముల్గొని రాజుల ♦ గౌరవించు
సద్గుణంబులనిధి శిబి ♦ చక్రవర్తి. 64

ఉ. శౌనకు డాదిగాగలుగు ♦ సర్వమునీంద్రులతోడ సూతుడున్
వీనుల కింపుగ్గలు శిబి ♦ వృత్త మశేషము బోధజేయగా
బూని వచించె నిట్లనుచు ♦ బూర్తిగ నూఅవజన్న మిచ్చుటన్
తా నొనరింపనెంచి శిబి ♦ తాపసులన్ దగ భక్తి బిల్వగన్. 65

## యజ్ఞార్థ మాహ్వానింపబడిన మౌనులు

ఉ. చేరిరి కణ్వ గౌతమ వ ♦ శిష్ఠ సుమంత పరాశరాత్రి ని
ర్వైరవిహారశక్తి వసు ♦ వామన కశ్యప గర్గ భార్గవాం
గీరస బాదరాయణ సు ♦ కీర్తి నిరంజన దక్ష కౌశికో
త్తారక సత్యసంధముఖ ♦ తాపసులున్ సహశిష్యులై త్వరన్. 66

కం. వచ్చినమునులకు బూజలు
జెచ్చెర గావించి వారి ♦ చిత్తము లలరఁ
హెచ్చగు యాగము జేయగ
నచ్చట ఋత్విజుల తోడ ♦ నారంభించెఁ. 67

వ. అట్టి సమయంబునందు యజ్ఞదర్శనలాలసులై వచ్చినవారిఁ
గూర్చి సూతుండు మౌనుల కిట్లు వచించె. 68

కం. కోమటులుఁ గోట్లకొలది
బ్రేమఁ సమకూర్చి ధనము ♦ బృథ్వీశునకుఁ
క్షేమంబు యజ్ఞదక్షిణ
హేమం బిది గొన్మటనిరి ♦ హృద్యంబనుచుఁ. 69

కం. భద్రంబుగ పనులన్నియు
క్షుద్రము గాకుండజేయు ♦ చుండిరి యజ్ఞో
పద్రవ మేమియు లేకఁ
శూద్రులు శిబిచక్రవర్తి ♦ సూక్తులు వినుచుఁ. 70

వ. మరియు నా యజ్ఞస్థలంబునందు 71

కం. పటిమగని నటీజనములు
నటనము జేయుదురు సభల ♦ ననువొప్ప దగఁ
దిటముగ స్తుతిపాఠకులుఁ
జటిలముగఁ శిబి నృపతి య ♦ శంబు నుతింపఁ. 72

నా ర ద ఋ షి వ చ్చు ట

చం. అనుపమ పుణ్యమూర్తి శిబి ♦ యాగము నప్పుడు చేయుచుండగా
విని సురమౌని నారదుడు ♦ వేడుకజెంది ధరాతలంబునఁ
గనుగొన వచ్చి జేరగని ♦ కౌశలియౌ శిబిచక్రవర్తియుఁ
వినయముతోడ జక్కగను ♦ వేదవిధిఁ ఋషిపూజ సల్పి తాఁ.

గీ. పంచకళ్యాణి నశ్వంబు ♦ బట్టి తెచ్చి
స్వర్ణపత్రము ముఖమునఁ ♦ వ్రాసి కట్టి
సైన్యయుతముగ విజయంబు ♦ సల్ప సుతుల
దీక్షతోడను వర్షంబు ♦ దెల్పి బనిచె. 74

మ. ఫలముఁ గోరక నశ్వమేధశతముఁ ♦ భక్తి ప్రశస్తంబుగా
నిలయందుఁ దగ జేయుచుండగను ము ♦ న్నేతెంచి మౌనీశ్వరుల్
తిలకింపంగ శిబీంద్ర, వార లిపుడుఁ ♦ దెల్పంగ నే వచ్చి గం
టి లవంబేనియు బొంకులేదుగద నీ ♦ కీవిఁ బ్రవృత్తంబునఁ. 75

కం. సురముని మరియును నిట్లను
ధరణీశునితోడ బరమ ♦ దాక్షిణ్యమునఁ
నిరుపమ వినయ విధేయ వి
తరణగుణమణిగణ హార ♦ ధర శిబి యనుచుఁ 76

ఉ. సేమమె నీకు బంధులకు ♦ శ్రేయమె నీదు సతీసుతాదులుఁ
బ్రేమ జనింప సైనికులు ♦ పెంపొనగూర్తురె యుద్ధభూమిలో
నేమరకుండ రాజ్యమున ♦ నింపుగ నుందురె మంత్రిపుంగవ
స్తోమము సర్వమానవులు ♦ తోషమునొంది సుఖించుచుందురే. 77

వ. అది విని శిబినృపుం డిట్లు వచించె. 78

చం. సురమునినాథ! మీ కృపను ♦ శోభిలుచుండును రాజ్యసంపదల్
పరమసుఖంబు జెందు నిట ♦ పావనమూర్తులు మౌనిసత్తముల్
నిరతము దేవఖాతకము ♦ నిర్మలవాసము నౌచునుండగఁ
నిరుపమభక్తితో దపము ♦ నిష్ఠగ సల్పుదు రెల్లవేళలఁ. 79

ఉ. నారద మౌనిచంద్ర! భువ ♦ నంబులగల్గు విశేషముల్ దగఁ
మీర లెరుంగుచుండుదురు ♦ మేలగువార్తలు వీనులఁ వినఁ
కోరికగల్గె నాకు తమ ♦ కుఁ దయగల్గిన జెప్పవేడదఁ
పారముజెంద నామదికి ♦ పావనమూర్తుల దివ్యబోధలఁ. 80

వ. వినుమని నారదుండు మరియు నిట్లనియె. 81

మ. శతయజ్ఞంబులు జేయుచుండ శిబి! నీ ♦ సత్కీర్తి ముల్లోకముల్
ప్రతిలేకుండగ నిండియుండె నిపుడుఁ ♦ రారాజ నిన్నెన్నగఁ
శతయజ్ఞంబులు జేసినట్టి సుర సం ♦ స్థానేశుడుఁ జాలునే
మతి సంతోషముజెందినాడ సుఖివై ♦ మాన్యుండ జీవింపుమా. 82

కం. మునికుల తిలకుడు నారద
ముని మృదుమధురోక్తులు దగ ♦ ముదమున బలుకన్
వినతుడగుచు శిబినృపుడున్
వినయమునన్ వినుచునుండె ♦ విశ్వస్థితులన్. 83

వ. అపుడు కణ్వాదిమౌనులు దేవమునిం గాంచి యిట్లనిరి. 84

చం. సురమునినాథ, నారద ! వ ♦ సుంధరయందున నశ్వమేధముల్
విరివిగజేసె నూఱు శిబి ♦ వేడుకజెంద సమస్తభూతముల్
వరమును లంత, మీ విమల ♦ వాఙ్మయబోధ వినంగగోరి స
త్వరముగ వచ్చినారు శివ ♦ తారకయోగము దెల్పుమన్నదాన్ 85

చం. కరుణవహించి నారదుడు ♦ కర్ణరసాయనమైన వాక్కులన్
గురుతరలక్ష్యభావయుత ♦ గోప్యమెరుంగుడు మీరలన్న నా
దరమున మౌనులున్ శిబియు ♦ ధన్యులమంచు సభాస్థలంబునన్
స్థిరముగ జేరియున్న గని ♦ జెప్పదొడంగెను దృగ్విచారమున్. 86

నారదముని సభ్యులకు తారకయోగమును జెప్పుట

## అం డ త్ర య ము

గీ. సతతమండాండమనగ భూ ♦ చక్రమగును
కొండవేరులు ప్రాణులున్ ♦ బిండమగును
యాకసంబును బ్రహ్మాండ ♦ మగుచునుండు
స్థూలరూపంబు లివియంచు ♦ జూడదగును. 87

## సూ క్ష్మాం డ త్ర య ము

గీ. కన్నులో గ్రుడ్డు నండంబు ♦ గనగ నందు
బిందువౌ పాప పిండంబు ♦ నందు నడుమ
వెలుగు కళ కంజజాండంబు ♦ వినుతముగను
నివియు సూక్ష్మాండములు మూడు ♦ భువిని దెలియ. 88

## పంచభూతములు

గీ. కన్నుచుట్టు నుండు నెరుపు ♦ గనగ భూమి
తెలుపు జలము నలుపు వహ్ని ♦ నలుపు నడుమ
నున్న నీలంబు గాలియం ♦ దున్న గళయు
నభము నందు నిష్కళ తాను ♦ నైజముగను. 89

## త్రివేణులు - షట్పద

గీ. కన్నులోని నల్లగ్రుడ్డు ♦ గంగ యగును
నీలమగు గుండలి యమున ♦ నీలమందు
బాపనడుమ వెలుగు గళగ ♦ బ్రాహ్మియనిరి
యదియు నీవారశూకంబు ♦ నదియు ముక్తి
కాంత గురువు నాహోజ్యోతి ♦ గనుట కదియె
విమల విద్యుల్లతయు నాత్మ ♦ విహిత తనువు. 90

## త్రిమూర్తులు

గీ. కన్ను చుట్టెరుపు నకార ♦ మెన్న విధియు
దెలుపు విష్ణుం డుకారంబు ♦ దెలియనగును
నలుపు భవుడు మకారంబు ♦ జెలువుమీర
నలుపులోని సునీలంబు ♦ నాద మెన్న. 91

గీ. గల్లు నోంకారమై యుండు ♦ గనుగొనంగ
దాని కవల నిశ్శబ్దంబు ♦ నైనదగుచు
నిష్కళ యనంగ బ్రహ్మంబు ♦ నిలుచు హృత్క
మల మగుచునుండు నిద్రాదు ♦ లలరు నందు. 92

## శక్తిపంచకము

గీ. ఎరుపనగ క్రియాశక్తిగా ♦ నెన్నదగును
దెలుపనగ జ్ఞానశక్తిగా ♦ దెలియ నగును
నలుపనంగ నిచ్ఛాశక్తి ♦ నైజముగను
నందలి సునీలమందుండు ♦ నాదిశక్తి. 93

గీ. ఆ సునీలంబునందుండు ♦ నట్టి కళయు
నగుచునుండు బరాశక్తి ♦ యందులోన
నిష్కళయనంగ బ్రహ్మంబు ♦ నిజముగాను
గనగ నట్టి బ్రహ్మంబు తాఁ ♦ గట్టిగాను. 94

## రే చ కా దు లు

(షట్పద గీతము)

గీ. ఎఱుపు రేచకమగుచుండు ♦ నెంచ దెలుపు
పూరకంబౌను నలుపగు ♦ బూర్ణకుంభ
కంబు నీలంబునౌ సూచి ♦ కంబు నీల
మందలి కళ సూచన మౌను ♦ నందు నుండు
నిష్కళయు దానుగా నున్న ♦ నిర్మలాత్మ
నయనమందున నివియుండు ♦ నియతముగను. 95

## మ ం డ ల త్ర య ము

గీ. నయనమందలి నలుపు ధ ♦ నంజయుండు
నందు నీలంబు జంద్రుండు ♦ నందు గళయు
భానుడౌ నందు నిష్కళఁ ♦ బ్రహ్మమండ్రు
నేత్రమందున మండల ♦ సూత్ర మిట్లు. 96

## స చ్చి దా న ం దా దు లు

గీ. సత్తన గళయౌ చుండును ♦ జిత్తనగను
బిందువౌను నిష్కళయన ♦ నందమలర
బరశివానందమౌను సు ♦ స్థిరతరం బి
ది యని జగ మస్థిరంబని ♦ తెలియనగును. 97

## త్వ ం ప దా దు లు

గీ. స్వప్రకాశమౌ తేజంబు ♦ స్వచ్ఛమైన
తత్పదంబు జీవత్వంబు ♦ త్వంపదంబు
బిందువందుండు గళయుంచు ♦ నందు మనసు
నిలిపిన నిష్కళాసి పదంబు ♦ నిజము గనుఢి. 98

## నాదాదులు

గీ. నీలమే నాదమౌను సు ♦ నీలమనగ
బిందువౌను, సునీలంబు ♦ నందునుండు
నట్టి సత్కాంతి కళయౌను ♦ నందు నిష్క-
ళంబు దానైన బ్రహ్మ స ♦ ల్లక్షణంబు. 99

## ఇడ పింగళ సుషుమ్నాదులు

గీ. నలుపు నిడయగు బింగళ ♦ నలుపునను సు
నీల మందు నడుమనుండు ♦ నిగ్గగు వరి
ముల్లువంటి సూక్ష్మబిల మం ♦ దెల్లలోక
ములను వ్యాపించి లోపల ♦ వెలుగు నాత్మ. 100

గీ. నంద్రు భ్రూమధ్యమంబన ♦ నది సుషుమ్న
మదియు మధ్యనాళం బంద్రు ♦ నదియు బ్రహ్మ
రంధ్ర మంద్రు మేరుశిఖర ♦ రాజ మంద్రు
నదియనంగ నాపోజ్యోతి ♦ యంద్రు బుధులు. 101

## సాలోక్యాదులు - షట్పద

గీ. ఎఱుపు సాలోక్యమగుచుండు ♦ నరయ దెలుపు
గనగ సామీప్యమగుచుండు ♦ నవల నీల
మనగ సామీప్యము సునీల ♦ మనగ వినుత
మైన సాయుజ్యము గళయు ♦ ననగ వెలయు
చుండు సారిష్ట్యమని జెప్ప ♦ జూడ నిందు
నిష్కళ విదేహకైవల్య ♦ నిలయ మగును. 102

## షట్చక్రములు

గీ. తనదు నాత్మ యాధార సు ♦ స్థాన మందు
నధిపతి గణపతియు నౌను ♦ విధియు దైవ
మగుచు నెఱుపు స్వాధిష్ఠాన ♦ మంద్రు దెలుపు
విష్ణుదైవంబు మణిపూర ♦ విలసనంబు. 103

గీ. నీలము ననాహతంబౌను ♦ శూలపాణి
దైవము తమోగుణము నౌను ♦ జీవు డధిపు
డైన బిందువును విశుద్ధ ♦ మంద్రము హృత్క
మలము బరమాత్మ దైవంబు ♦ మరియు నదియె. 104

గీ. జీవగుణమౌ గళాగ్నేయ ♦ శివభవంబు
నందు నిష్కళ దానౌను ♦ నదియు బ్రహ్మ
మదియు నంతరాత్మయు నగు ♦ నది సహస్ర
కిరణముల సహస్రారంబు ♦ గురుడు విభుడు. 105

## శూ న్య చ క్ర ము లు

గీ. నీలమందుండు బంగారు ♦ నిగ్గు నొకటి
నందు ధూమ్రవర్ణ మొకటి ♦ యలరుచుండ
నందు తామ్రవర్ణ మొకటి ♦ యందమొందు
గాంచు డివియౌను శూన్యచ ♦ క్రములు మూడు. 106

## అష్టదళములు - పంచపద

గీ. ఎఱుపు నెఱుపునఁ దెలుపును ♦ మరియు దెలుపు
దెలుపునఁ నలుపును మరి ♦ నలుపు నలుపు
నందు గపిలవర్ణంబును ♦ నందు నుండు
నల సునీలంబునందుండు ♦ నట్టి దీప్త
మౌ స్ఫటికవర్ణ మివియె ద ♦ ళాష్టకంబు. 107

## బా హ్యా త్రి పు టు లు

గీ. ఎఱుపు నందలి దెలుపును ♦ నెరిగి యవల
దెలుపునందలి నలుపును ♦ దెలిసికొనియు
నలుపునందలి తామ్రంబు ♦ నమ్మి చూడ
బాహ్యమందలి త్రిపుటుల ♦ భావ మలరు. 108

## అంతర త్రిపుటులు

గీ. విను సునీలంబు స్ఫటికంబు ♦ వినుతమైన
దీప్తి యనియెడు మూడును ♦ దెలియదగును
నంతరంబందు నుండెడు ♦ నట్టి త్రిపుటు
లివియు గురుముఖంబున గాంచ ♦ భువిని దెలియు. 109

## బ్రహ్మసాక్షాత్కారము

గీ. నిర్మల రహస్య రమ్యమౌ ♦ నిలయమందు
దీపకాంతికి ముందుండి ♦ తాపముడిగి
నాశికాగ్రదృష్టినిల్పియు ♦ నయనములను
దెరచి దీపమును గనగ ♦ దేటగల్గి. 110

గీ. వెల్గు గానుపించునదియు ♦ విన బరాత్మ
యవల గనులు మూసియు జూడ ♦ నవగతమగు
స్వస్వరూపంబునందు ని ♦ ష్కళను జూడ
నదియు బ్రహ్మసాక్షాత్కార ♦ మంద్రు బుధులు. 111

గీ. రాత్రి నేకాంతమౌ చోట ♦ రాజితంబు
నైన దీపంబు నుంచి ప్ర ♦ యత్న మలర
గురువు జెప్పిన మార్గంబు ♦ గూడియుండి
మౌనియై మానసైకాగ్ర ♦ మగ్నుడగుచు 112

గీ. కనులమధ్యను గోప్యమై ♦ గానుపించు
నదియు నంగుష్ఠపర్వంబు ♦ నంతదగుచు
నంతకంతకు సూక్ష్మంబు ♦ నగ్రమగుచు
ధ్రువమునైయుండు సతతంబు ♦ రూఢిదెలియ. 113

గీ. నట్టి నేత్రంబు లందుండి ♦ యతిరహస్య
మైన చిన్మూర్తి దృశ్యంబు ♦ నైనదంత
జూచు నాపాదమస్తకం ♦ బౌచునున్న
తనువు లన్నియు లకించి ♦ తథ్యముగను. 114

గీ. అచలమై స్వచ్ఛమై శాంత ♦ మై నిరంజ
నంబునై కాయసంస్థిత ♦ నైపుణంబు
నైన తేజంబు సర్వంబు ♦ నందు వ్యాప్తి
నొంది నిండియున్న దెపుడు ♦ బొందుగాను. 115

గీ. అట్టితేజంబు విమలంబు ♦ నైనదగుచు
నుండు బద్మగర్భంబు నం ♦ దుండు దెలియ
గోచరించును బ్రత్యక్ష ♦ మౌచు నచట
దానితో సాటిలే దెందు ♦ తథ్యముగను. 116

గీ. అరుణ సిత కృష్ణ నీల పీ ♦ త రుచు లలరు
నేత్రమండలి జ్యోతియే ♦ నిశ్చయముగ
గేవలంబగు బ్రహ్మమై ♦ కెరలుచుండు
వేదవేదాంతవేద్యమై ♦ వెలయు నదియె. 117

గీ. నేత్రయుగళంబు భ్రూమధ్య ♦ నిలయ మగును
నది యధోముఖకమలంబు ♦ ననగబడును
నందు హం క్షం బనుచు రెండు ♦ నక్షరములు
నలర వాయుమండలమందు ♦ దెలియనుండు. 118

గీ. అందు నుండు నంతర్జ్యోతి ♦ బిందురూప
మగుచు నీలమేఘంబునం ♦ దలరుచుండు
నట్టి విద్యుల్లతను బోలి ♦ యందముగను
కాంతిగల్గినదగుచుండు ♦ ఘనతరముగ. 119

గీ. నదియు నీవారశూకంబు ♦ నంత సూక్ష్మ
మై పసిమిరం గలరుచుండు ♦ నణుసమాన
మై సదాశివమై యుండు ♦ నందు నుండు
శిఖకు నడుమను పరమాత్మ ♦ జెలగుచుండు. 120

గీ. నతడు పరమేష్ఠి భూతేశు ♦ డతడు హరియు
నతడు పురుహూతు డాతండు ♦ నతడు బరుడు
నతడు స్వరాట్టనగబడు ♦ నతనిగాంచ
ధ్యానయోగంబు సద్గురు ♦ నాజ్ఞ గొనుము. 121

గీ. అతడు రవికోటిదీప్తుల ♦ నలరుచుండు
చంద్రకోటి శీతల మొంది ♦ శాస్త్రవేద
వేద్యమానుండు నగుచుండు ♦ వినగ గనగ
సూరిజనులకు సులభుండు ♦ శుభకరుండు. 122

గీ. ఆత్మతేజఃప్రభావంబు ♦ ననుసరించి
చంద్రసూర్యాగ్నులును సుతే ♦ జంబు నొందు
లోన వెలుపల నంతట ♦ లోకములను
వ్యాప్తి నొందుచు వెలుగొందు ♦ నాత్మ యతడు. 123

గీ. మున్ను జెప్పిన ద్విదళంబు ♦ గన్నులగును
వాటి మధ్యను వెలుగొందు ♦ సాటిలేని
సర్వసారంబు దర్శించి ♦ సజ్జనుండు
సూరివినుతుడై శాశ్వత ♦ సుఖము నొందు. 124

గీ. భువిని ప్రారబ్ధమైనట్టి ♦ భోగములను
ననుభవించును దేహంబు ♦ నంతమొందు
నింద్రియాసక్త మగుచున్న ♦ నెలమి జెడును
దుఃఖసంసారజలధిలో ♦ ద్రోయబడును. 125

గీ. జ్యోతి రూపంబునను సర్వ ♦ భూతములను
వ్యాప్తి జెంది చిదాత్ముండు ♦ దీప్తి నొందు
నట్టి జ్యోతి నేత్రాగ్రంబు ♦ నందు నుండు
జ్ఞాననేత్రంబుతో జూడ ♦ గానుపించు. 126

గీ. సకల వేద వేదాంత శా ♦ స్త్రములయందు
జదువగఁ గాంచు సత్యమౌ ♦ సార మిదియు
బార్వతియు నడుగ శివుండు ♦ నిర్వచించి
జెప్పిన మహత్తన నిదియె ♦ నొప్పిదముగ. 127

గీ. వారణాసీపురంబు స ♦ ద్వాస మగుచు
వెలయు విశ్వనాథుండు స ♦ ద్విశ్వగురుఁడు
సదుపదేశంబు దక్షిణ ♦ శ్రవణమందు
మరణకాలంబునఁ జేయు ♦ మంత్ర మిదియె. 128

చం. సురముని తారకం బిటుల ♦ శోభిలునంచును జెప్పుచుండగా
హరి జనె బశ్చిమాద్రి శిఖ ♦ రాగ్రము నప్పుడు నాకసంబుపై
నరుణరుచుల్ వెలుంగ నపు ♦ డా సభయందలి వార లందరుఁ
దరుణమటంచు వైదికవి♦ధానము సల్పిరి సంధ్యయందునఁ. 129

ఉ. తారక లప్పుడుఁ బొడమె ♦ దైవవశంబున నాకసంబునఁ
కోరిన యట్లు మల్లె విరి ♦ గూర్చిన బందిలి జక్రవర్తికిఁ
కూరిమితోడ గట్టుబడి ♦ గొల్లగ సల్పియు యజ్ఞశాలపై
మీరిన రత్నదీప మన ♦ మెల్లగ జంద్రుడు దోచె దూర్పునఁ. 130

చం. కలువలు బూచె బద్మములు ♦ కాంతి దొలంగ వికాసమంతమై
వెల వెల బారె ధూర్తజన ♦ విద్యలు సల్పుచు జారచోరులుఁ
బలువిధచర్యలఁ జనుల ♦ బాధలుబెట్టి చరించుచుండియుఁ
తెలతెలవారుచుండ దమ ♦ ధీమము దప్పిరి భీతినొందుచుఁ.131

ఉ. భానుడు తూర్పుదిక్కునను ♦ భాసిలె సత్క్రియలెల్ల సల్పుచుఁ
మానవులందు సజ్జనులు ♦ మాన్యతబొంది పరోపకారులై
దీనతలేకయుండి సమ ♦ దృష్టిచరించిరి పాపకర్ములుఁ
భానిసలై జగంబునను ♦ బాధల బొందుచునుండి రప్పుడుఁ. 132

## నారదుని ప్రయాణము

చం. జపతపహోమ సత్క్రియలు ♦ సల్పుచు నర్థుల నాదరించి స
ద్విపుల మనోవికాసమున ♦ వీసరబోని విశాలదృష్టితో
రపణముగా బుధోత్తముల ♦ రంజిలజేయు శతాశ్వమేధి యై
న పుడమిఱేనితో ననియె ♦ నారదు డప్పుడు సంతసంబునన్. 133

గీ. పోయివచ్చెద శిబిరాజ ♦ పుణ్యపురుష !
స్వర్గలోకంబు గైలాస ♦ సత్యలోక
విష్ణులోకంబులన్‌జూడ ♦ వేడుకలరె
నంచు నచ్చోటనుండియు ♦ నరిగె దివికి. 134

శా. నాదానందముతోడ గూడుకొని వీ ♦ ణా గానమున్ సల్పుచున్
వేదాంతోక్తుల భావయుక్త హృదయా ♦ వేశంబు పైగప్పగన్
భేదాభేదవివర్జితంబు నగుచున్ ♦ బెంపొంద భక్తిప్రభల్
శ్రీ దేవున్ స్మరణంబు జేయుచు మదిన్ ♦ జేరెన్ దివిన్ జూడగన్.

వ. ఇట్లు నారదుండు నాకలోకంబు ప్రవేశించి ఇంద్రసభ కరుగు
చున్నంత 136

కం. వచ్చెడు నారదు గనుగొని
చెచ్చెర బూజించి హృదయ ♦ చింతలు దీరన్
హెచ్చిన మచ్చిక శతముఖు
డచ్చుపడన్ బలికె హితము ♦ లన్నియు వినగన్. 137

కం. అనుచు బలికిన సురవిభుని
గనుగొని సురముని వినుమని ♦ కనిన నిజంబున్
మనమున దాచక జెప్పెద
ననఘా యనె నాదరమున ♦ నమరేశునితోన్. 138

గీ. వచ్చినాడను భువినుండి ♦ వాస్తవముగ
మూడులోకంబులందుండు ♦ ముఖ్యులందు
సాధుచరితుండు భువి శిబి ♦ చక్రవర్తి
యశ్వమేధంబు లొకనూఱు ♦ నతడు జేసె. 139

వ. మరియు 140

సీ. తపసుల బూజించు ♦ దైవంబు నర్చించు
దీనుల బోషించు ♦ దినదినంబు
రాజుల బ్రేమించు ♦ రాజ్యంబు బాలించు
రాగంబు లేకుండ ♦ రహిని మించి
ధర్మ ముపార్థించు ♦ దాతయై నిత్యంబు
ధనము లర్థులకిచ్చి ♦ దనుపుచుండు
భోగముల్ త్యజియించు ♦ బుద్ధిని నియమించు
బుధులను సేవించి ♦ బోధవినును
గీ. దేవ భూదేవ వృత్తుల ♦ దీయ డెపుడు
ధర్మశాస్త్రానుసారంబు ♦ ధరణి నేలు
గ్రోధముంచడు శాత్రవ ♦ కోటియందు
న్యాయశిక్షణ శిబిరాజు ♦ జేయుచుండు. 141

వ. శౌనకాదిమునులారా! నారదువాక్యంబులఁ విని పురుహూతుండు

కం. ఘనమగు సందేహంబును
మనమునకుఁ దోచె నిపుడు ♦ మౌనీశ్వర! మీ
రనుచుండెడు మాటల నే
వినగను వినుపింతు వాని ♦ వివరము మీకుఁ. 143

గీ. కామధేనువు గల్పవృ ♦ క్షామృతకల
శంబు జింతామణియు గల్గి ♦ స్వర్గమందు
సకల భోగ భాగ్యంబులఁ ♦ సంతసమున
ననుభవించెడు నాకిప్డు ♦ నార్తి గల్గె. 144

గీ. సుర గరుడ యక్ష సాధ్య కిం ♦ పురుష సిద్ధ
మునులు విద్యాధరవరులు ♦ వినయమలర
కిన్నరులు వర గంధర్వ ♦ పన్నగాదు
లెన్న సభనున్న నాకున్న ♦ వన్నె దరిగె. 145

చం. శతహయమేధయాగములు ♦ సల్పిన నారదమౌనిచంద్రమా
పతియగు స్వర్గరాజ్యమున ♦ బావనుడై శిబిచక్రవర్తియుఀ
గతియగు స్వర్గరాజ్యమున ♦ గాపురముండుట నాకు నెట్లికఀ
శతమఘు డన్నయట్టి నను ♦ శాత్రవులందరు జూచి నవ్వరే. 146

కం. అన విని నారదు డంతట
విను మని వచియించె నీకు ♦ విధి హరి హరులుఀ
ఘన సుఖమార్గము గూర్తురు
చను మచటికి భయములేదు ♦ సత్వరగతితోఀ. 147

కం. సురనాయక ! నా మాటలు
స్థిరమతివై నమ్మి పొమ్ము ♦ సేవ్యులు వారల్
నిరతము భక్తుల కోర్కులు
గొరతలు లేకుండనియ్య ♦ గొప్ప సమర్థుల్. 148

నారదుండు సత్యలోకంబున కరుగుట

గీ. పోయివచ్చెద బరమేష్ఠి ♦ భువనమునకు
బాకశాసన ! స్వర్లోక ♦ పాలనంబు
జేయుచున్నట్టి నీహక్కు ♦ జెడదు వినుము
పట్టు విడకుండ నామాట ♦ బట్టి జనుము.

వ. అంత త్రిదశాలయంబునందు నుండి బయలువెడలి జనుచుండె.150

కం. నారాయణ నారాయణ
నారాయణ యనుచు వీణ ♦ నాదం బిడగఀ
నారద మౌనీంద్రుండును
వారిజభవులోక మరిగె ♦ వార్తాహరుడై. 151

వ. ఇట్లు జేరి చతురాస్య సభామంటపంబు ప్రవేశించి 152

కం. సవినయవాక్కుల బ్రహ్మకు
వివిధవిధుల నారదుండు ♦ వినతుండఃగుచుఀ
భువి శిబిచారిత్రంబును
దివి పురుహూతుని చరిత్ర ♦ దెలియగ జెప్పెఀ. 153

వ. నారదువాక్యంబులఁ విని భారతీభర్త వాత్సల్యంబున నిట్లనియె.154

కం. కన్నాడను నిన్నిప్పుడు
విన్నాడను నీవు జెప్ప ♦ విశ్వస్థితులఁ
కన్నన్నా సుఖమున్నా
వన్నా నారద యని విధి ♦ యాత్మజు నడిగెఁ. 155

కం. జనకుని వచనములను విని
ఘనమగు మీ కృప నిజముగ ♦ గల్గిన నాకుఁ
వనజభవా ! సుఖమేకద
యనుచు బలికె నారదుండు ♦ నలరెడు బ్రీతిఁ. 156

నారదుండు బ్రహ్మనుమతితో వైకుంఠాదుల కరుగుట

చం. జనకు ననుజ్ఞబొంది హరి ♦ శంకర లోకములఁ గనఁ జనఁ
మనమున వేడ్క జెంది సుర ♦ మౌని వినమ్రతతోడ దండ్రి కి
ట్లని వచియించె ధాత ! ఘన ♦ మైనతలంపు జనించె వాసుదే
వ నిలయ శంకరాలయ ని ♦ వాస మొనర్చి భజించి వచ్చెదఁ.157

కం. హరిహరుల కడకు నరిగెద
హరి శిబిచరితంబు వారి ♦ కంతయు జెపుదుఁ
జరణంబుల నర్చింతును
జరితార్థుడనంచు నేను ♦ సన్నుతిజేతుఁ. 158

గీ. లోకసంచార మొనరించి ♦ లోకవార్త
లెల్ల లోకపాలకులగు ♦ నిందిరేశ
పార్వతీశుల కెరిగించు ♦ బనియు నాకు
జేయ నుద్యోగధర్మంబు ♦ సిద్ధిబొందు. 159

మ. పయనంబై తన తండ్రి యాజ్ఞగొని స ♦ త్ప్రాప్యంబులౌ ధామముల్
రయమొప్పార మరుత్పథంబునను జే♦రం బోవుచుఁ ముందుగఁ
బ్రయతుండై జనె భార్గవీరమణ సం ♦ బంధంబు వైకుంఠ మ
వ్యయ కైలాసము నా పయిఁ జని లస ♦ ద్వాక్యస్తుతుల్ జేయుచుఁ

ఉ. శ్రీ రమవాణీశ్వరీప్రియుల • జేరి వినం దగ నారదుం డనెన్
ధారుణియందునన్ త్రిదశ • ధామమునన్ జరియించి వచ్చితిన్
భూరి శతాశ్వమేధములు • భూపతియౌ శిబి జేసె భూస్థలిన్
వైరియటంచు నింద్రుండు ది • వంబున భీతిలుచుండ జూచితిన్.

గీ. ఇటుల వచియించె నారదుం • డిందుమీద
గథను ఋషులకు సూతుండు • గలిగినంత
వినగ జెప్పెద వినుడని • వేడ్కతోడ
జిష్ణు పయనంబు మొదలుగన్ • జెప్పదొడగె. 162

కం. సురరాజు గురునితోడను
పరివారము గొల్వ బ్రహ్మ • పట్టణమునకున్
సురగురు డొప్పిన శుభతిథి
నరుగుదమని బయలుదేరె • నానందముతోన్. 163

## ఇంద్రుండు బ్రహ్మసదనంబున కరుగుట

కం. గుమిగొని నడువన్ దొడగిరి
కొమరుమిగుల నమరు లంత • గుజగుజబడుచున్
గమలజు పురమున్ జూచిరి
నిముసములో దైవకృపను • నిశ్చలమతులై. 164

చం. కనుగొని జేరి రందరును • గన్నుల బండు వటంచు నేడు వా
రనుకొని బ్రహ్మపట్టణము నందున • రంజిలు గోపురంబులున్
వినుతములైన సౌధములు • వీధుల సొంపు సుగంధవాసనల్
ఘనమగు రత్నదీపముల•గాంచ శుభోదయ మంచు నత్తరిన్. 165

సీ. చతురాస్యు పట్టణ • చాతుర్య మింద్రుండు
వేయికన్నులతోడ • వేడ్కగనియె
బరమేష్ఠిపురవీధి • పారిశుద్ధ్యము జూచి
కనురెప్పవాల్పక • గనిరి సురలు

బ్రహ్మసభఁ గల్గు ♦ బ్రహ్మణ్యు లందర
గనుగొని ధిషణుండు ♦ గౌరవించె
వాగీశు గృహశిల్ప ♦ వైభవచిత్రంబు
పరికించి మునులంత ♦ భాగ్యమనిరి

గీ. భారతీభర్త పదయుగ ♦ పద్మములకు
మ్రొక్కి రందరు దివిజులు ♦ మోదమలర
రత్నసింహాసనంబున ♦ రాజసమున
సృష్టికల్పన బరమేష్ఠి ♦ జేయునపుడు. 166

గీ. మ్రొక్కిన పురందరుని జూచి ♦ మురియునటుల
గౌరవించియు క్షేమంబు ♦ గల్గు నటుల
దివ్యవాక్కుల దీవించె ♦ దివిజతతిని
తగినవిధమున బ్రేమించె ♦ దనియునటుల. 167

వ. అంత సురజ్యేష్ఠుండు శతముఖుహృద్గతం బంతయు నెరింగి
యుండి హితవచనంబుల నిట్లనియె. 168

కం. హరి హరులను దర్శింపుము
సురనాయక వార లంత ♦ శుభముల నడుగఁ
వెరువకు సత్యము జెప్పుము
కరుణింతురు నీకు మేలు ♦ గల్గెడు నటులఁ. 169

గీ. అనగ నింద్రుండు బ్రహ్మకు ♦ ననియె నిట్లు
స్వామి నాయందు దయయుంచి ♦ స్వాంతమందు
నన్ను గూరిచి జనుదెంచి ♦ తిన్నగాను
హరి శివుల కంతయును జెప్పు ♦ న్యాయవిధిని. 170

వ. అందుల కనుమతించి విరించి యిట్లనియె. 171

చం. అమరులతోడ గూడుకొని ♦ యబ్జభవుండు వికుంఠధామముఁ
గ్రమమున వెండికొండకును ♦ రండిదె పోవుదమంచు జెప్పుచుఁ
సమకొనునంచు సర్వమును ♦ సంతసమొంది సుఖప్రయాణులై
విమలత నొంది లెండు మది♦వేలుపులార యటంచు బ్రహ్మయుఁ.

## ఇంద్రుడు సత్యలోకమునుండి వైకుంఠమున కరుగుట

ఉ. వేలుపురాజు వేలుపులు ♦ వేధనుగూడి ప్రయాణులై చనన్
మేలగుదేజముఙ్ గని ని ♦ మీలితనేత్రులునై గతిఙ్ గసం
జాలక వేల్పులందరును ♦ సన్నుతిజేసిరి దానవాంతకుఙ్
పాలనజేయు మీదయకు♦బాత్రుల మంచన తక్షణంబునన్. 173

సీ. పాలకడలియందు ♦ బావనంబైనట్టి
దెలిదీవి గనుపించె ♦ దివ్యముగను
బంగారుమయమైన ♦ బ్రాకారముల నొప్పి
వైకుంఠధామంబు ♦ వ్యక్తమందు
నవరత్నమంటప ♦ నగరంబు దాపల
ఘనకల్పతరు లొప్పు ♦ వనమునందు
స్వర్ణ కమల రమ్య ♦ సరసి సన్నిధినుండు
సౌధంబునన్ భోగి ♦ శయ్యయందు

గీ. లక్ష్మితోడను యానంద ♦ లగ్ను డగుచు
దివ్య మంగళ రుచుల దే ♦ దీప్యమాన
దేహుడు గమలనయనుండు ♦ దేజరిల్లు
చుండ జూచెను బ్రహ్మాది ♦ సురగణంబు. 174

కం. గరుడగమన! నీనాభి జ
లరుహజననమున మదీయ ♦ లంపట లెల్లన్
పరుగిడె జన్మ తరించెన్
సురపతి వన్నె జెడకుండ ♦ జూడుము దయతోన్. 175

కం. శతమఘుడను నన్నేలుము
సతతము నిను నమ్మియుంటి ♦ సారసనయనా!
పతనము నాకుఙ్ గల్గెను
క్షితిలో శిబిచక్రవర్తి ♦ జేయగ హవముఙ్. 176

కం. పాకదనుజ వైరి వినుము
నాకడ కరుదెంచి మున్ను ♦ నారదమునియుఁ
నీ కథ నంతయు జెప్పెను
వ్యాకులపడకుము విను మొక ♦ వాక్యము జెపుదుఁ. 177

వ. అంత నారాయణుండు శక్రునిఁ గూర్చి యిట్లనియె. 178

ఉ. వాసవ ! నీకు నీశ్వరుడు ♦ వాస్తవ మిచ్చిన హక్కు దీనికిఁ
మోసమురాదు వెళ్ళుము స ♦ మూహముతోడ శివాలయంబుకుఁ
భాసిలుచున్న శంకరుని ♦ పాహియటంచును వేడు మంతటఁ
దోసమడంచు నా హరుడు ♦ దూర్ణ మశేషసుఖంబు లెచ్చెదుఁ.

మ. శివభక్తుండు శివార్పణం బనుచు సు ♦ శ్రేయోశ్వమేధంబులఁ
శివసంప్రీతిగ జేసినట్టి శిబి స ♦ చ్ఛీలుండు శైవంబునఁ
భవితవ్యంబు ఫలింపజేయు సదయుఁ ♦ భర్గుండు వృద్ధశ్రవా
వివరంబంతయు జెప్పినాడ జనుమా ♦ విశ్వేశు సాన్నిధ్యముఁ. 180

## ఇంద్రుండు గైలాసంబున కరుగుట

మ. స్థిరసంభావ్యుడు సద్వచోనిపుణ సం ♦ సిద్ధుండు వైకుంఠుడుఁ
మరలఁ స్వర్గమతిఁ సమాదరముతో ♦ మన్నించి కైలాసముఁ
వర కార్యార్థము జేరుమంచు శివు స♦ర్వాత్ముం బ్రశంసింపుచుఁ
సురనాథుఁ బయనంబుజేసి పనిచెఁ ♦ శూలిఁ గనఁ సత్వరఁ.

శా. పేరాసఁ బురుహూతు డబ్జభవుతో ♦ బెంపొందు కైలాసముఁ
జేరంబోవుదమంచు బల్కు నతడుఁ ♦ శీఘ్రంబుగా వచ్చెదఁ
భారంబంతయు జక్రపాణి కిడుమీ ♦ ప్రాప్తార్థివై నెమ్మదిఁ
ధీరత్వంబున లెమ్ము పొమ్ము హరియుఁ ♦ దేవేంద్ర తోడౌ జుమీ.

మ. హరియుఁ బ్రహ్మయు సమ్మతించి బనుపఁ♦సానందుడై శక్రుడుఁ
గిరిజానాథు బదారవిందముల భ ♦ క్తిఁ గొల్వ బృందారకుల్
బరివేష్టింప సుఖప్రయాణములతో ♦ భాసిల్లుచుఁ బోవుచుఁ
వరతేజంబును గాంచి దిగ్భ్రమణుడై ♦ వర్తిల్లె విభ్రాంతితోఁ. 183

మ. మతికిఁ దోచక మార్గముఁ గనక ధీ ♦ మం బేమియుఁ లేక దీ
నత నొందంగ సురేంద్రు దేల్చుటకు వి ♦ జ్ఞానంబుతో నార్తు నే
లు తలం పొప్పు భవుండు తెల్వి నిడగఁ ♦ లు ప్తంబు లేకుండగఁ
శ్రితరక్షార్థము నిట్లుజేయ నపుడుఁ♦క్షేమంబుగఁ ముందటఁ. 184

సీ. ఉత్తర దిక్కునం ♦ దుండు కమలజాండ
కౌశల భిత్తిని ♦ గాచి వెండి
కొండ యలరె రత్న ♦ గోపుర ప్రాకార
విశ్రాంతి మంటపాల్ ♦ వేలు వెలయ
ప్రతి మంటపం బందు ♦ ప్రమథగణంబులు
కోటొక్కపై యొప్పు ♦ కొరతలేక
దివ్యసరస్సులు ♦ దివ్యవృక్షంబులు
వెండికొండను జుట్టి ♦ వెల్గుచుండు
గీ. వెతలు పిరువది కోట్లుండు ♦ బొడవు జూడ
నలుబదియుగోట్లు యోజన ♦ ములును గల్గి
యొప్పు నెత్తెన్న దెలియదు ♦ జెప్పలేని
దట్టి రజితాద్రి గనుపించె ♦ నమరపతికి. 185

సీ. వెండికొండకు దూర్పు ♦ విఘ్నేశ్వరుండుండి
వీతిహోత్రుని దిక్కు ♦ వీరవరుడు
దక్షిణదిక్కున ♦ దనరారు వృషభుండు
బలలాశనునిదిక్కు ♦ భైరవుండు
వరుణదేవుని దిక్కు ♦ శరజన్ముడుండియు
వనదుర్గయుండియు ♦ వాయుదిశను
కౌబేరదిశ మహా ♦ కాళుండు నుండియు
శంకరదిశయందు ♦ శాస్తు డుండి
గీ. కోట్లగొలదిగ సైనికుల్ ♦ గొల్చుచుండ
నష్టదిక్కులయం దుండి ♦ హరునిగృపను
ననుదినంబును రజితాద్రి ♦ ననుసరించి
కేవలానంద శివమూర్తి ♦ సేవ సల్పు. 186

గీ. ఇట్టి శివభక్తకోటిని ♦ నింద్రుడాది
సురులు గనుగొని తమరాక ♦ సరణి జెప్పి
వెలిహజారమునందుండి ♦ వేడుకొనుచు
సాంబ ! సాష్టాంగనతు లంచు ♦ శరణ మనిరి. 187

కం. శౌనకుడాదిగ మునులకు
సూనృతవాక్యములతోడ ♦ సూతుం డనియెన్
దీనజనావను నీశ్వరు
నానతికై వజ్రి సల్పు ♦ నభినుతి వినుడీ ! 188

శా. గౌరీవల్లభ చంద్రచూడ శివ లో ♦ కానంద సంధాయకా
కారుణ్యాలయ కాలకాల కమలా ♦ కాంతస్తుతాంఘ్రిద్వయా
మారాకారవినాశ ఫాలనయనా ♦ మాతంగ దైత్యాంతకా
రారా యీశ్వర కావరా నను కృపన్ ♦ రక్షింపరా కొల్చెదన్. 189

గీ. ధరయు రథంబు సారథి వి ♦ ధాత రథాంగము లర్క చంద్రులున్
శరధి సముద్రమున్ శరము ♦ శౌరి గుణం బహిరాజు విల్లుని
ర్జర నిలయంబు గుఱ్ఱములు ♦ ఛందములున్ రథివౌచు నీవునున్
పురములు మూడు గాల్చితివి ♦ పుణ్యచరిత్రుడవయ్య శంకరా ! 190

కం. కమలముల కాప్తమిత్రుడు
గమలవిరోధి గగనమును ♦ గంధవహాగ్నుల్
గమలములు బుడమి జీవుడు
దమకును మూర్త్యష్టకమని ♦ దలతుము శంభూ ! 191

గీ. పాకశాసను రాకయు ♦ బ్రార్థనంబు
శ్రవణగతమైన శంభుండు ♦ జారునకును
సభకు దోడ్కొనిదెమ్మని ♦ సంజ్ఞనిడగ
త్రిదశులన్గూర్చి యింద్రుని ♦ దెచ్చె సభకు. 192

## ఇంద్రుండు సదాశివుని దర్శించుట

చం. శివునకు తాండవోత్సవము ♦ జేయు సమంచితకాల మౌటచేఁ
ప్రవిమలభక్తితో రజిత ♦ పర్వతశృంగ విరాజితంబునౌ
భవసభ గాంచ జన్మములు ♦ బావన మౌనను నిశ్చితాత్ములై
వివిధ సుకర్మలఁ జరుపు ♦ విజ్ఞులు వచ్చిరి పూర్వపుణ్యతఁ. 193

చం. నిరుపమ తాండవంబు శివ ♦ నిర్మల సత్సభయందు జూడగఁ
హరి కమలాసనాది సురు ♦ లందరు వచ్చిరి సంతసంబునఁ
సురపతి కన్న ముందుగను ♦ సుస్వరవాద్యవిశేషముల్ దగఁ
కరములయందు నుంచుకొని ♦ గానముజేయు కుతూహలంబునఁ.

## పంచచామరవృత్తము

మురారి పద్మజాదులైన ♦ ముఖ్యదేవు లందరుఁ
పరాత్పరుఁ శివుఁ భజించి ♦ భవ్యరత్న పీఠముల్
గిరీశు నాజ్ఞనొంది జేరి ♦ గేయ శైవనామముల్
సురాగతాళయుక్త మొప్ప ♦ చుండ బాడి రప్పుడుఁ. 195

మ. శివు డానందముతోడ తాండవము సం ♦ సేవ్యంబుగా సల్పుచో
దివిజుల్ మౌనులు జూచి రా సభను సం ♦ దృశ్యంబు గన్గొంటి మో
భవ! నీ దర్శనభాగ్య మొందితిమి స ♦ త్ప్రాప్యంబు సంభావ్యముఁ
నివసింపఁ దయయుంచి బ్రహ్మపద సా♦న్నిధ్యంబు బోధింపవే. 196

గీ. హరుడు గాంచన మణిమయం ♦ బైన దివ్య
కేసరీపీఠమందున ♦ గిరితనూజ
తోడ బేరోలగం బుండి ♦ తుష్టిగాను
సురులు నందరు వినుతింప ♦ శుభము లడిగె. 197

వ. హరి బ్రహ్మేంద్రాది బృందారకబృందంబుఁ సభామంటపాసీనులఁ గావించి భర్గుం డనర్గళవాక్ప్రచారంబున బ్రహ్మనుభవస్థితిఁ సిద్ధి బొందుండనుచు నిట్లు బోధింప దొడంగె. 198

## బ్రహ్మవిచారము

గీ. బ్రహ్మ సత్యం బఖండం బ ♦ పరిమితంబు
నిరుపమానంబు బూర్ణంబు ♦ నిర్గుణంబు
సచ్చిదానంద మేకంబు ♦ చలనరహిత
మగుచు సర్వంబు దానయై ♦ యలరు నందు. 199

## ప్రకృతిలక్షణము

గీ. నిర్వచింపంగ రానట్టి ♦ నెలవుగల్గి
భ్రమయు బ్రకృతి రజ్జు భుజగ ♦ భ్రాంతి నొప్పు
నదియు దివ్యంబు గుణమయం ♦ బగుచు జడము
నై జగ మనబడదగిన ♦ దగుచు నుండు. 200

## ఈశ్వరతత్త్వ నిరూపణము

గీ. శుద్ధసత్త్వప్రధానమౌ ♦ చున్న బ్రకృతి
మాయ యనబడు నందు ని ♦ ర్మలుడు నీశ్వ
రుం డనగ బ్రహ్మతేజంబు ♦ నిండియుండి
సర్వసామ్రాజ్య విభుశక్తి ♦ నిర్వహించు. 201

## జీవజగల్లక్షణములు

గీ. మలినసత్త్వ ప్రధానంబు ♦ గల దవిద్య
యందు బ్రహ్మంబు జీవత్వ ♦ మొంది యుండు
జ్ఞాన మల్పంబు గామ్యంబు ♦ మానకుండు
జడము జగము తమోగుణ ♦ జన్య మగును. 202

## సూక్ష్మభూతాంతఃకరణ ప్రాణోత్పత్తులు

గీ త మా ల

అంత నీశ్వరునివలన ♦ నాకసంబు
శబ్దగుణకంబునై బుట్టు ♦ సక్రమముగ
శబ్ద సంస్పర్శ గుణయుగ్మ ♦ సంభవంబు
గాలి, యందు శబ్దస్పర్శ ♦ కలితరూప

గుణమునఁ వహ్నియందుండి ♦ గణనకెక్కి
శబ్దసంస్పర్శరూప ర ♦ సగుణయుతము
నగుచు జలము నందువలన ♦ నందమలరి
శబ్దసంస్పర్శరూప ర ♦ సయుతగంధ
విలసిత ధరణియగు బంచ ♦ విధములంచు
భూతముల్ సూక్ష్మముల్ విడి ♦ పోక వాని
సత్వగుణ సమష్టిజ్ఞాన ♦ శక్తి ముఖ్య
మగుచు నంతఃకరణ ముద ♦ యంబు నయ్యె
పర రజోగుణ సర్వంబు ♦ వలన ఘనత
ర క్రియాశక్తి ముఖ్యంబు ♦ ప్రాణమయ్యె
మరియు నంతఃకరణము నా ♦ ల్గు రకములను
ప్రాణ మైదు రకములను ♦ ప్రబలుచుండు. 203

గీ. ప్రాణ మైదగుఁ బ్రాణం బ ♦ పానమనగ
వ్యానము నుదానము నమాన ♦ మనగబడుచు
మానస మతి చిత్తాహంకృ ♦ తుల్ నుతింప
నియతి నంతఃకరణచతు ♦ ష్టయము నయ్యె. 204

## జ్ఞానేంద్రియ జన్మము

గీ. అట్టి భూతసత్వగుణంబు ♦ లందు వ్యష్టి
చేత గ్రమమునఁ శ్రోత్ర మ ♦ జినము గన్ను
నాలుకయు ముక్కునగ బంచ ♦ నామములను
జ్ఞానవిషయంబు లుదయించె ♦ మానితముగ. 205

## కర్మేంద్రియ జన్మము

గీ. అందలి రజోగుణములందు ♦ వ్యష్టిచేత
గ్రమమునఁ నోరు చేయి జ ♦ రణము గుద ము
పస్థ యనుచుండు నైదును ♦ భవము నొందు
గర్మవిషయము లివియంచు ♦ గనగవలెను. 206

## సూ క్ష్మ శ రీ ర ల క్ష ణ ము

గీ. కాంచ జిత్త మహంకార ♦ కలితమగుచు
హృన్మతులయందు గలియంగ ♦ హృదియు మతియు
బ్రాణములు నైదు జ్ఞాన క ♦ ర్మ విషయములు
నైదు నైదు సూక్ష్మతనువు ♦ నౌఁ బదేడు. 207

## కా ర ణ శ రీ ర ము

గీ. సూక్ష్మదేహంబు లింగాంగ ♦ లక్షణంబు
భోగసాధనమగుచుండు ♦ భూతతతికి
కారణంబైన కాయంబు ♦ గనుగొనంగ
దెలివిమాలు నవిద్యగా ♦ బలుకబడును. 208

## పం చ మ హా భూ త స్థూ లో త్ప త్తి

గీ. మున్ను జెప్పిన భూతంబు ♦ లన్ని విడక
గలిసియుండి పంచీకృత ♦ ము లగుచుండ
స్థూలభూతము లనబడు ♦ చుండు వాని
వివరమంతయును దెలియు ♦ విధ మదిట్లు. 209

గీ. భూతపంచక మొక్కొక్క ♦ భూతమందు
రెండు భాగము లగుచుండి ♦ రెంటియందు
నర్ధభాగంబు నిలచియు ♦ నర్ధమందు
నాల్గుభాగము లగుచుండి ♦ నట్టు లేక. 210

గీ. నిలచియున్నట్టి సగమునఁ ♦ గలిసి పోవ
స్థూలభూతములైదును ♦ శోభమాన
ము లగుచున్న భాగాధిక ♦ ముల దమకును
నామముల్ గల్గుచుండు ♦ ఘనంబుగాను. 211

గీ. తనరె డర్ధమం దితర భూ ♦ తాష్టభాగ
ము లగుచున్న నాల్గును భాగ ♦ ములు జేర
నైదు నైదులు భాగంబు ♦ లలరుచుండి
స్థూలభూతంబు లైదును ♦ సొంపు జెందు. 212

## బ్రహ్మాండోత్పత్తి

గీ. ప్రబలు బంచీకృతములగు ♦ బంచభూత
ముల వలన కంజజాండంబు ♦ గల్గుచుండు
నందు బదునాల్గు లోకము ♦ లలరుచుండు
నట్టి బ్రహ్మాండ మది విరా ♦ ట్టనగబడును. 213

## స్థూలదేహోత్పత్తి

గీ. మరియు బంచీకృతమగు భూ ♦ తరచనమున
స్థూలదేహంబు బ్రభవించు ♦ చుండు నిటుల
స్థూల సూక్ష్మ కారణములం ♦ చుండు తనువు
లందు వ్యష్టి సమష్టియ ♦ న్నంటుగలదు. 214

## జీవవ్యష్ట్యుపాధులు

గీ. వ్యష్టికారణోపాధి సం ♦ వాసి బ్రాజ్ఞు
డనగ వ్యష్టి సూక్ష్మోపాధి ♦ యందు దైజ
సుండు వ్యష్టియౌ స్థూలస్థి ♦ తుండు విశ్వు
డనగ జీవుం డుపాధుల ♦ యందు నుండు. 215

## అవస్థాత్రయసాక్షి జీవునిస్థితి

గీ. నిదుర స్వప్నంబు జాగ్రత ♦ నియెడు మూ డ
నగ నవస్థ లంతఃకర ♦ ణమున నుండు
వానికిని సాక్షి జీవుండు ♦ వాస్తవముగ
వ్యష్ట్యుపాధులయం దుండి ♦ యలరుచుండు. 216

## ఈశ్వరసమష్ట్యుపాధులు

గీ. కారణ సమష్ట్యుపాధి సం ♦ గతుడు నీశ్వ
రుం డనబడుఁ హిరణ్యగ ♦ గర్భుండు నుండు
సూక్ష్మతనువున సూత్రాత్మ ♦ లక్షణమున
స్థూల తనువన వైశ్వాన ♦ రాలయంబు. 217

## ఈశ్వరుం డుత్పత్తి స్థితి లయంబు లొనర్చుట

షట్పద

గీ. కారణ సమష్ట్యుపాధి సం ♦ గతుడ గీశ్వ
రుడు రజోగుణ ముఖ్యమౌ ♦ రుచిని బొంది
బ్రహ్మయై సత్వగుణ ముఖ్య ♦ రక్తి నొంది
విష్ణువై తమోగుణ ముఖ్య ♦ విభవ మొంది
రుద్రుడై పుట్టుకఁ బెంపు ♦ రూపు మాపు
బనులను గ్రమమునను జేయు ♦ భద్రముగను. 218

## జీవేశ్వరాభేదము

గీ. ఈశ్వరునకు జీవునకు ని ♦ జేచ్ఛ లరయు
చో నుపాధిభేదము దప్ప ♦ జూడ నెందు
నెట్టి బరమార్థభేదంబు ♦ నెన్నలేదు
దెలివిలేకున్న భేదంబు ♦ గలుగుచుండు. 219

## అజ్ఞానంబు భావపదార్థముగా నెఱుంగుట

గీతమాల

తెలివితక్కువ నాదిగా ♦ గలవరంబు
నొందుచుండు భావపదార్థ ♦ ముండు నందు
నదియు రెండు విధంబుల ♦ నలరుచుండు
నొకటి విక్షేపశక్తిగ ♦ నొప్పుచుండు
వేరొకటి నావరణశక్తి ♦ విదితముగను
నందు విక్షేపశక్తి కృ ♦ త్యమున జగము
నగుచునుండు మరియు విన ♦ నగుచు నుండు
నావరణశక్తికృత్య మ ♦ ధ్యాస మనుచు
నుండు నందువలన గల్గు ♦ చుండు నొక్క
టున్న నదియు నన్యంబగు ♦ చున్న దనగ
ఘనతరారోపణంబును ♦ గల్గజేయు
దెలిసికొన నావరణశక్తి ♦ బలము గనగ

రెండువిధము లగుచునుండు ♦ రీతి గలదు
నం దసత్త్వావరణ మొక ♦ టగును మరియు
నొక టభానావరణమన ♦ నొప్పుచుండు
మున్ను జెప్పిన నధ్యాస ♦ మూల మరయ
నాత్మయం దనాత్మ ననాత్మ ♦ యందు నాత్మ
ధర్మ ముద్భవింపగజేయు ♦ దప్పకుండ
నాత్మ గానట్టి యన్నమ ♦ యంబు ప్రాణ
మయమును మనోమయంబును ♦ మరియు నవల
నరయ విజ్ఞానమయమును ♦ నలరుచుండు
నంత నానందమయమును ♦ ననగ నైదు
గోశములు నగు నం దన్న ♦ కోశ మనగ
స్థూలదేహంబు ప్రాణంబు ♦ తోడ గర్మ
విషయములు నైదు గలియంగ ♦ వెలయు ప్రాణ
కోశ మనగ మనోమయ ♦ కోశ మనగ
జ్ఞానవిషయంబు లైదును ♦ మానసంబు
తోడ గలియ నగును బుద్ధి ♦ తోడ జ్ఞాన
విషయములు నైదు గలియంగ ♦ వినుత మగుచు
నొప్పు విజ్ఞానకోశంబు ♦ మెప్పుగాను
గారణశరీర మనునది ♦ గనుగొనంగ
వినుత మానందమయకోశ ♦ మనుచు నొప్పు
ప్రాణ మానస విజ్ఞాన ♦ పరములైన
గోశములు మూడు సూక్ష్మంగ ♦ గోచరములు
నిట్టి వన్ని యనాత్మలు ♦ నిట్టివాని
యందు నాత్మ నారోపణ ♦ మమరజేయు
నట్టి యధ్యాస చిత్రంబు ♦ గుట్టు దెలియ
బంధహేతువు సంసార ♦ పంకిలంబు
జాపు బుట్టుక లిందున ♦ సంభవించు
నిట్టి యధ్యాసనాశంబు ♦ నెట్టులనిన
వినుత విజ్ఞానమే దీని ♦ వేరు విత్తు

విమల విజ్ఞాన మన్నను ♦ వినుడి మీరు
స్వస్వరూపానుసంధాన ♦ సరణి యగుచు
శాశ్వతానంద ఫలసిద్ధి ♦ సాధనంబు
గాన జ్ఞానసంపాద్యంబు ♦ మానరాదు. 220

## జ్ఞానసంపాదనము

చం. త్రిదశనివాసు లందరును ♦ దిక్పతులందరు మౌనులందరుఁ
హృదయములందు మీర లిది♦హృద్యమటంచును నమ్మియుండుడీ
మది నిది నమ్మి మానవులు♦మాయకు దూరగులౌచు నుండియుఁ
ముదమున జ్ఞానులై గనిరి♦మోక్షము శాశ్వతసౌఖ్య మొందుచుఁ.

కం. జ్ఞానము సంపాదించు వి
ధానము సాధన చతుర్వి ♦ ధంబుల సల్పఁ
బూనినవాడై వేదాం
తానుభవమునఁ వివేక ♦ తత్త్వము నొందుఁ. 222

## సాధనచతుష్టయములు

కం. స్థిర మస్థిరముఁ దెలియుట
పరమున నిహమునను భోగ ♦ ఫలముఁ విడుపుఁ
సరవిఁ శమముఁ మొదలగు
వరసంపద లారు గనగ ♦ వలయును ముక్తిఁ. 223

కం. కనుగొనగను నాల్గు విధము
లను సాధన సంపద లివి ♦ లక్షింపంగఁ
వినగ శమాదికషట్కం
బనునది వినుపింతు వినుడి ♦ బుద్ధికి దెలియఁ. 224

కం. చెవికిని సాధన సంపద
వివరముగా దెలుసుకొనెడు ♦ వేడ్క జనింపఁ
ప్రవిమలమగు నాల్గింటిని
చవిగొనుడి శమాదిషట్క ♦ సంగతి గనుడీ. 225

కం. మనమున లోకవ్యాప్తిని
గనకున్న శమమనబడును ♦ గనుగొన దమముఀ
వినుడీ బహిరింద్రియజయ
మనబడు, సన్న్యాస ముపర ♦ తనబడు మరియుఀ. 226

కం. శీతోష్ణాదిక సహనము
ఖ్యాతిగ జేయఀ తితీక్ష ♦ యనబడుచుండుఀ
చేతస్సైస్థైర్యంబు గనుట
చేత సమాధానమగును ♦ స్థిరముగ వినుడీ. 227

కం. గురువాక్యమును వేదాంతము
స్థిర సమ్మతి గనిన శ్రద్ధ ♦ దెలియనివారుఀ
సరి యంతరంగ సాధన
లరయఀ బ్రహ్మవిదులందు ♦ ఖ్యాతిగ వెలయుఀ. 228

## బహిరంగసాధనలు

గీ. ఇటుల బహిరంగసాధన ♦ తెలమి దెలియ
వినగ వేదశాస్త్ర విహిత ♦ విధులయందు
బావకార్చనౌపాసన ♦ పథములందు
విడువ కాచరింపదగును ♦ వినుతముగను. 229

గీ. తెలియ వీనిని వేదంబు ♦ దేటబరచు
గర్మ నిష్కాముడై చేయ ♦ ధర్మమగును
ఫలము నీశున కర్పించ ♦ దెలివిగలుగు
వేదమార్గంబు విడరాదు ♦ విజ్ఞులకును. 230

గీ. కర్మకాండం బుపాసించు ♦ గాండమనియు
జ్ఞానకాండంబు నంచును ♦ వీనులలర
మూడు విధముల వేదం బ ♦ మూల్యముగ న
నాదినుండియు దెల్పును ♦ నైపుణముగ. 231

## కర్మకాండ వివరము

గీ॰ కర్మకాండంబునందున ♦ ధర్మ మరయ
యజ్ఞమాదిగ నొనరించు ♦ యత్నముననుకర్తృదైవత రూపంబు ♦ గనుగొనంగ
జేయును, మరి యుపాసన ♦ జేయు విధము. 232

## ఉపాసనాకాండ వివరము

గీ. ఈశ్వరోపాసనమునందు ♦ నిచ్ఛగల్గి
సేవ్యసేవక కృత్యంబు ♦ జేయుమనుచు
దెలియబల్కుచు నుండును ♦ దేటగాను
దగ నుపాసనాకాండంబు ♦ ధర్మమిదియు. 233

## జ్ఞానకాండ వివరము

గీ. జ్ఞానకాండంబు నిర్గుణం ♦ బైనయట్టి
బ్రహ్మతత్త్వయాథార్థ్యంబు ♦ బాట జూపు
నదియు నగుచును వేదాంత ♦ మనుచు నుపని
షత్తులనుచును బిలువ బ్ర ♦ శస్తమగును. 234

గీ. అందు ముఖ్యంబులును బది ♦ యనగబడును
జ్ఞానపరములు ముక్తిని ♦ ధానములును
గర్మకాండం బుపాసనా ♦ కాండము నన
జ్ఞానకాండాంగము లటంచు ♦ గానబడును. 235

## కర్మనిష్ఠు లరుగు మార్గము

గీ. కర్మనిష్ఠు లిష్టాపూర్త ♦ ధర్మవిధుల
నర్థకాంక్షను గర్మల ♦ నాచరించి
ఫలమునం దాసజెంది ♦ భూతలమునందు
నుండి దేహాంతమందున ♦ నొందుగతులు. 236

గీ. ధూమమార్గంబునందుండి ♦ తొలగిపోక
ధూమముఁ రాత్ర్యసితపక్ష ♦ యామములను
దక్షిణాయనమార్గము ♦ దాపరింప
నందు బితృలోకమును జేరి ♦ యందు నుండి. 237

గీ. శశిజగము నాకసంబున ♦ జనియు నధిక
కాలమందుండి పుణ్యంబు ♦ క్షయమునైన
గర్మశేషంబు భుజియించు ♦ కాలమందు
భువిని జన్మంబు మరలను ♦ బొందుచుంద్రు. 238

## స్వర్గచ్యుతులమార్గము

గీ. ఇటులనే స్వర్గమున కేగ ♦ నెలమి నచట
గర్మశేషంబు గలవారు ♦ గాంచుబేర్లు
ననుశయు లనబడుచునుండు ♦ నట్టివారు
స్వర్గమునువీడి ఖంరూప ♦ వంతు లగుచు. 239

గీ. మెల్లగను వాయు ధూమాభ్ర ♦ మేఘరూప
ములను దాల్చి వర్షోదక ♦ మూలముననుసు
వడ్లు నోషధుల్ ధాన్యముల్ ♦ వన్యములుగ
బుట్టుచు ప్రాణుల కన్నమై ♦ భోజనంబు. 240

గీ. జేయ రేతస్స్వరూపంబు ♦ జెంది పుణ్య
పాపకర్మానుగుణములఁ ♦ బట్టుబడుచు
నుత్తమంబు మధ్యమము న ♦ నుత్తమంబు
లైన యోనులఁ జేరుచు ♦ లోకమందు 241

గీ. వ్యక్తులై బుట్టు ధూమాభ్ర ♦ వర్త్మమునకు
దక్షిణపుమార్గ మనియును ♦ దనరుచు బితృ
యాణ మంచును బిలువంగ ♦ రాణితంబు
నగుచునుండును స్వర్గీయ ♦ యాన మిదియు. 242

## ఉపాసకుల మార్గము

గీ. కన నుపాసనాకాండంబు ♦ వినుత భక్తి
యోగ యుక్తంబునై కొంత ♦ యాగ కర్మ
లందు నంగంబు నగుచుండు ♦ నందువలన
గర్మ సుసమృద్ధి కుపయోగ ♦ ధర్మముండు. 243

గీ. కొంత కేవల కామ్యంబు ♦ గూర్చునట్టి
దగుచు శ్రేయోపయుక్తంబు ♦ సుగతిజూపు
ముఖ్యసాధనంబు నగును ♦ ముదితముగను
గేవల మొక కొంతయును ము ♦ క్తి సుఖ మిడును. 244

గీ. మరియు నది క్రమముక్తి స ♦ న్మార్గ మగును
గర్మనిష్ఠు లీ జెప్పిన ♦ కర్మలందు
ఫలము గోరక నీశ్వరా ♦ ర్పణ మనియెడు
బుద్ధితో జేయ సంపూర్ణ ♦ సిద్ధి గంద్రు. 245

గీ. వీర లరిగెడు మార్గంబు ♦ విమలమైన
తేజ మిడు నర్చిరాదిక ♦ దివ్యమార్గ
మరయ నర్చిరాదిజగ మ ♦ హర్భువనము
రశ్మియుత శుక్లపక్షో త్త ♦ రాయణంబు. 246

గీ. శుభకరంబైన వర్షంబు ♦ సూర్య చంద్ర
జగము లెలమి విద్యుల్లోక ♦ జలపతిభువ
నంబు స్వర్గంబు బ్రహ్మలో ♦ కంబునను
గ్రమమునఁ జేరి యందుండి ♦ రారు భువికి. 247

గీ. కమలజుజగముఁ సత్యలో ♦ కం బటందు
రర్చిరాదిమార్గ మమర ♦ యానమంద్రు
మరియు నది యుత్తరాయణ ♦ మార్గ మనిరి
మరచి దీనిని ధూమాది ♦ మార్గములను 248

గీ. మరల మరల విధుని లోక ♦ మరుగుచుండి
క్షోణియందు బుట్టుదు రది ♦ శోకయుతము
నర్చిరాదిమార్గమున బ్ర ♦ యాణమైన
వారు మరల జన్మకు వచ్చు ♦ వారు గారు. 249

గీ. బ్రహ్మపట్టణమందుండి ♦ బ్రహ్మవలన
శ్రవణ మనన నిధిధ్యాస ♦ సార మెరిగి
బ్రహ్మతోడ గూడి జనన ♦ రహిత మోక్ష
సిద్ధి నొందుచుందురు మృత్యు ♦ చింత లేక. 250

## ముక్తుల లక్షణము

గీ. శ్రేయమును గోరువారలు ♦ శ్రేష్ఠమైన
దంచు నిష్కామకర్మంబు ♦ నాచరించి
యీశ్వరానుగ్రహము నొందు ♦ చిందుచేత
దత్త్వవిజ్ఞాను లౌదురు ♦ దలప నందు. 251

గీ. ఘన పరోక్షాపరోక్షము ♦ లనగ జ్ఞాన
మలరుచుండు ద్వివిధములు ♦ నౌచు నందు
లో బరోక్షమౌ జ్ఞానవి ♦ లోకనంబు
వినుత వేదాంతశాస్త్రంబు ♦ వినుటయండ్రు. 252

గీ. శ్రవణమని దీని నందురు ♦ శ్రవణమునను
సంశయములేక బ్రహ్మంబు ♦ సత్యమనెడు
భావమొందు శూన్యాసత్వ ♦ భావశక్తి
సావరణ మంత నశియించి ♦ సమయు నదియు. 253

గీ. అవల మననంబు జేయంగ ♦ నందువల్ల
నాశమై బో నసంభావ ♦ నంబు నంత
నల్పవలయు నిదిధ్యాస ♦ నదమలముగ
నందు ధ్యేయంబు ధ్యాతయు ♦ ధ్యానము లను 254

గీ. త్రిపుటి గోచరించుచునుండ ♦ దీనియందు
ధ్యేయ మొకటియే భాసిల్లి ♦ దీప్యమాన
మగుచు నున్న సమాధియౌ ♦ నందు నున్న
వాని పుణ్యపాపము లన్ని ♦ కానరావు. 255

గీ. ఉడిగి సంచితాగామియం ♦ చుండు గర్మ
లన్ని నశియించు బ్రారబ్ధ ♦ మనుభవించ
నాశనంబౌను బ్రాణుల ♦ నైజ మిట్లు
మరియు గోప్యంబు బ్రహ్మైక్య ♦ మహిమ వినగ. 256

గీ. బ్రహ్మ మపరోక్షవిజ్ఞాన ♦ భావమందు
స్థిరతరానుభవంబున ♦ సిద్ధమైన
నిలువజాలక శిథిలమై ♦ తొలగలేక
నొగి నభానావరణ మంత ♦ మొందు నపుడు. 257

గీ. సచ్చిదానందరూపంబు ♦ జలన వర్జి
తంబు బూర్ణంబు సునికి యై ♦ దనరుచుండు
నంత జనన మరణ దుఃఖ ♦ మంత మొందు
నిర్వికారుండునై యుండు ♦ నిజ మతండు. 258

## విజ్ఞాననిరూపణము

గీ. జ్ఞానకర్మ సముచ్చయం ♦ బైనదన్న
మాట నిరసనంబు నగును ♦ బాటవముగ
జ్ఞాన మొక్కటె ముక్తికి ♦ సాధనంబు
కర్మసహితం బదెప్పుడుఁ ♦ గాదు తెలియ. 259

గీ. జ్ఞాన మపరోక్షమై యున్న ♦ జ్ఞానమగును
కర్మయన వేదశాస్త్ర సు ♦ ధర్మమగును
సదపరోక్షవిజ్ఞానంబు ♦ సంభవించ
గర్మలను జేయు బనిలేదు ♦ ఘనతకొరకు. 260

గీ. సదమలాపరోక్షజ్ఞాన ♦ సంభవంబు
గల్గ నపుడు మానంగ ద ♦ గదు సుధర్మ
యుక్తకర్మసమూహంబు ♦ రక్తిగల్గి
సకల మీశ్వరార్పణమంచు ♦ సల్పు శుభము. 261

గీ. బ్రహ్మమునకన్న జీవుండు ♦ బరుడుగాడు
జగ మబద్ధంబు బ్రహ్మంబు ♦ సత్యమగును
బ్రవ్రజన యోగసిద్ధులుఁ ♦ బ్రహ్మమందు
ధన్యులై జేరియున్నా ర నన్యముగను. 262

గీ. ఆకసము రీతి నంతట ♦ నావరించి
వాయువిధ మగోచరమునై ♦ వ్యాప్తినొంది
లోన వెలుపల నిండి వె ♦ లుంగు చున్న
బ్రహ్మతేజంబు విజ్ఞాన ♦ రసికు డెరుగు. 263

గీ. జడమగు జగంబు సూదంటు ♦ జాడ నినుము
గదలు నటులను గదలును ♦ గాంచ బ్రహ్మ
మందు రజ్జుసర్పభ్రాంతి ♦ నొందినపుడు
నిజము దెలియంగ సుఖమొందు ♦ నిర్భయముగ. 264

గీ. ఆత్మయని భావమని స్థాన ♦ మంగ మనుచు
నాల్గుదెరగుల శిష్యుండు ♦ నమ్మి గురుని
భక్తి శుశ్రూషలను జేయ ♦ ముక్తికొరకు
యుక్తకాలంబునఁ జెప్పు ♦ ముక్తి గతిని. 265

గీ. సూక్ష్మబుద్ధియౌ శిష్యుండు ♦ సూనృతంబు
గోరి యడుగ నాపోజ్యోతి ♦ గుర్తు జూడు
మనుచు జూపును సూచనం ♦ బపుడు గురుడు
నదియు బరిపూర్ణపరమాత్మ ♦ యనగబడును. 266

గీ. సభ్యులందరు సంతోష ♦ సాగరమున
మునిగియుండిరి శివునకు ♦ వినతు లగుచు
నంత నీశ్వరు డింద్రున ♦ కనియె నిట్లు
విమలవిజ్ఞానబోధను ♦ వినిన యపుడు. 267

## శివుం డింద్రునితో విహితోక్తులు జెప్పుట

చం. వినవగు నింద్ర! నానుడుగు ♦ వీనుల కింపగు నంచు భర్గుడుఁ
ఘనమని నీవు నగ్నియును ♦ గగ్గొన శ్యేన కపోతవేషులై
మును పాకమారు నాశిబిని ♦ ముమ్మర జన్నము జేయునప్పుడుఁ
పనిగొని చేరి చూచియును ♦ బావనుడంచని దృప్తి జెందకఁ. 268

వ. మరియు వినుము. 269

గీ. కామరహితుండునై జేయు ♦ గర్మ లన్ని
త్యాగశీలుండు ధర్మార్థ ♦ తత్పరుండు
నీశ్వరార్పణమని యిచ్చు ♦ నీవు లన్ని
నట్టి శిబిరాజు నీ కేమి ♦ హానిగోరు. 270

గీ. ఇంద్ర! నారదు డేతెంచి ♦ యిచ్చటికిని
నిన్నుగూర్చిన కథ జెప్పె ♦ నెమ్మితోడ
శిబి భువిఁ నూఱు సవనముల్ ♦ జేయ నీవు
భయము నొందితి వంచని ♦ బలికె నతడు. 271

ఉ. నీకును మేలు గల్గుగద ♦ నిర్మలభావముతోడ నుండినఁ
వ్యాకుల మేల బొందెదవు ♦ వ్యర్థపు స్పర్థను జెందబోకుమీ
లోకమునందు లేరు బరు ♦ లూర కసూయను బొంద దుఃఖమే
గాక సుఖంబు లేదనుచు ♦ గల్మషమొందక నుండు మింద్రుడా.

శా. ఈ రీతిఁ బలుకంగ నీశ్వరమనో ♦ భీష్టంబు గుర్తించియుఁ
మీ రున్నారని నమ్మి బొమ్మనుచు మి ♦ మ్మేనమ్మి దర్శించియుఁ
ధీరోదారులటంచు సన్నుతులతో ♦ దేవేంద్రు రక్షింపగా
మారాకఁ వినుపించినార మనుచుఁ ♦ మా వాక్పతుల్ బల్కగాఁ.

వ. శివుండు విష్ణు విరించి ప్రముఖ దివ్యమూర్తులు వినుచుండ నింద్రునితో నిట్లు వచించెనని సూతుండు శౌనకాదులతో గథావిశేషంబుల జెప్పం దొడంగె. 274

గీ. ఇంద్ర! శిబిని మరల జూడ ♦ నిచ్ఛయున్న
జనుము నీవు గపోతమై ♦ సంచరించ
భువికి శ్యేనమై యగ్నియు ♦ గవియు నిన్ను
జిక్కకుండంగ డేగకు ♦ శిబిని జేరు. 275

గీ. యాగశతమందు శిబిచేత ♦ సర్చితుండు
గాన శ్యేనంబు నీ కడ్డు ♦ గల్గెనేని
శ్యేనముఁబట్టి నీ పని ♦ సిద్ధిబొంద
బోయనై వచ్చి సర్వంబు ♦ బూని జేతు. 276

గీ. అంత వజ్రి కపోతంబు ♦ నయ్యె వహ్ని
శ్యేనమై మర్త్యలోకంబు ♦ జేరి గిరుల
వనముల బొలములను నూళ్ళ ♦ గనుపడంగ
దిరుగుచుండెను శ్యేనంబు ♦ దరుముచుండ. 277

గీ. ఆకసంబున శ్యేనంబు ♦ నంటి దిరుగ
జిక్కకుండ గపోతంబు ♦ శిబినిజేరు
యత్నముఁ జేయ శ్యేనంబు ♦ నడ్డగించె
బావురంబుకు గార్యంబు ♦ భంగపడియె. 278

గీ. నూఱుజన్మంబులందున ♦ భూరిపూజ
లొనరజేసిన కారణ ♦ మున్నకతన
శిబినృపాలుని క్షేమంబు ♦ శ్యేన మరసి
పావురంబును బోనీక ♦ బాధపెట్టె. 279

గీ. ఉచ్చు లురులును వలయును ♦ మచ్చుగింజ
లుంచు సంచులు జంకయం ♦ దుంచుకొనియు
జిఱ్ఱబారిన వెంట్రుకల్ ♦ జింపి గోచి
గట్టి వచ్చెను నెరుకండు ♦ మిట్టిపడుచు. 280

గీ. బోయరూపంబు ధరియించి ♦ పొలుపుమీర
శ్యేనమునుబట్టు నీశుండు ♦ జేరి దరికి
బట్టి బుట్టను బెట్టెను ♦ దిట్టముగను
బావురంబును జిక్కకఁ ♦ బోవుచుండె. 281

గీ. బుట్టయందున శ్యేనముఁ ♦ బట్టి పెట్టి
జంకయందున నద్దాని ♦ జక్కనునిచి
బావురంబును వ్యాధుండు ♦ బట్టి నేడు
బుట్టలోనుంతు నంచును ♦ భువిని దిరిగె. 282

గీ. అంబులును విల్లు జేతియం ♦ దలరుచుండ
గత్తి మొలనూలుతో జెక్కి ♦ మత్తుడగుచు
గల్లు ద్రాగంగ జేవురౌ ♦ కనులు గల్గి
పొంచి పావురమును బట్ట ♦ బోయె బోయ. 283

గీ. బోయవచ్చెడు జాడ గ ♦ పోత మెరిగి
చిక్కకుండంగ బోయకు ♦ జెంగు జెంగు
నను గగనవీధి నెగురుచు ♦ నాట్య మొప్ప
జేసి జగమునందు దిరిగె ♦ జెంగలించి. 284

కం. ముప్పాగ దిప్పలు బెట్టుదు
తప్పదు నిను మూడు జెర్ల ♦ దగు నీరంబుఁ
దప్పిగొనఁ ద్రాగింతును
దప్పింప గపోతమ ! భువి ♦ దాతయు గలడే. 285

గీ. జగములన్నియు దిరిగితి ♦ దిగులు బడుచు
శ్యేనభాధను గొన్నాళ్లు ♦ దానినుండి
భయము దొలగించి బోయండు ♦ బట్ట నేడు
నన్ను బంతంబులాడు చు ♦ న్నా డిదెట్లొ. 286

గీ. బోయరూపంబు ధరియించి ♦ పొలుపుమీర
శ్యేనమునుబట్టు నీశుండు ♦ జేరి దరికి
బట్టి బుట్టను బెట్టెను ♦ దిట్టముగను
బావురంబును జిక్కకఁ ♦ బోవుచుండె. 281

గీ. బుట్టయందున శ్యేనముఁ ♦ బట్టి పెట్టి
జంకయందున నద్దాని ♦ జిక్కనునిచి
బావురంబును వ్యాధుండు ♦ బట్టి నేడు
బుట్టలోనుంతు నంచును ♦ భువిని దిరిగె. 282

గీ. అంబులును విల్లు జేతియం ♦ దలరుచుండ
గత్తి మొలనూలుతో జెక్కి ♦ మత్తుఁడగుచు
గల్లు ద్రాగంగ జేవురౌ ♦ కనులు గల్గి
పొంచి పావురమును బట్ట ♦ బోయె బోయ. 283

గీ. బోయవచ్చెడు జాడ గ ♦ పోత మెరిగి
చిక్కకుండంగ బోయకు ♦ జెంగు జెంగు
నను గగనవీధి నెగురుచు ♦ నాట్య మొప్ప
జేసి జగమునందు దిరిగె ♦ జెంగలించి. 284

కం. ముప్పుగ దిప్పలు బెట్టుదు
తప్పదు నిను మూడు జెర్ల ♦ దగు నీరంబుఁ
దప్పిగొనఁ ద్రాగింతును
దప్పింప గపోతమ ! భువి ♦ దాతయు గలడే. 285

గీ. జగములన్నియు దిరిగితి ♦ దిగులు బడుచు
శ్యేనభాధను గొన్నాళ్లు ♦ దానినుండి
భయము దొలగించి బోయండు ♦ బట్ట నేడు
నన్ను బంతంబులాడు చు ♦ న్నా డిదెట్లొ. 286

మ. నిను జూడన్ హృది జాలి గల్గినది నీ ♦ నేరంబు లా బోయ డే
మని నాతోడ వచించునో వినెద సు ♦ వ్యక్తంబుగా నంతయున్
విన నాహారముగాను నిన్నడుగ సం ♦ తృప్తిన్ దినన్ గుక్షికిన్
ఘనభక్ష్యంబులతోడ భోజనము నే ♦ గల్పింతు నిచ్ఛాగతిన్. 292

చం. విను మిది నిశ్చయంబు మది ♦ వేడుక జెంది భయంబు లేకయున్
మను మిక నీచరిత్రమును ♦ మంతనమందున దాచ కిచ్చటన్
వినెదను బావురంబ! కడు ♦ వేడుక గల్గెను జెప్పు నా కనన్
వనమున నుండ నన్నుగని ♦ వచ్చెను డేగ భుజింప మున్నుగన్.

ఉ. దానిని జూచి బోయ డొక ♦ దారిని నుచ్చుల నొడ్డి పట్ట నే
దానిని జూచి భీతిపడి ♦ దప్పక బోవుదమంచు యత్నమున్
బూని నభోగతిన్ జనుచు ♦ బోయనిచేతికి జిక్కకుండగన్
మానవనాథ మీదరికి ♦ మంగళ మబ్బు నటంచు వచ్చితిన్. 294

కం. ఖగము శిబినృపునకు దెలియ
దగు బలుకుల దన చరిత్ర ♦ దలకుచు దెలిపెన్
పగ గొని పంతము లాడుచు
బొగరున బోయండు వచ్చె ♦ భువి నాజాడన్. 295

గీ. పావురము వచ్చి చేరిన ♦ బాట గనుచు
దారి డొంకలు గానక ♦ దైవగతిని
గొండ లడవులు దాటుచు ♦ మండిపడుచు
జేరవచ్చెను జెజర్ల ♦ దారి బట్టి. 296

గీ. సొక్కి సోలుచు బోయండు ♦ శోష జెంది
యాకలాయెను నన్నంబు ♦ లేకబోయె
బక్షికొరకును దిరిగితి ♦ బల్లె పల్లె
గానుపించక నెటు బోయె ♦ గగనమందు. 297

గీ. పక్షిమాంసంబు భక్షించి ♦ గుక్షినిండ
దృప్తిజెందుట నా కెట్లొ ♦ దెలియబడదు
నెందు బోయెనొ యేదిక్కు ♦ కేగువాడ
ననుచు బోయండు జేజర్ల ♦ కపుడు జేరె. 298

గీ. శిబినృపు గపోత మాశ్రయిం ♦ చిన విధంబు
బురజనుల్ జెప్ప విని యంత ♦ బోయవాడు
దొరికె నా సొమ్ము బోయెద ♦ దొరనుజూడ
బక్షిమాంసంబు దిననిచ్చి ♦ పంపకున్నె. 299

శా. మాయారూప కిరాతుడైన హరుడుఁ ♦ మర్యాదతో నా శిబిఁ
మాయోపాయముబన్ని చేరి యడిగెఁ ♦ మాయయ్య నాయన్నముఁ
దీయఁ నాయముగాదు పావురము నా ♦ తిండౌను యీప్రొద్దుగఁ
దాయఁగాడు దయామయా ! విడువుమీ ♦ దాగున్న బక్షిఁ దగఁ.

ఉ. దేవరహస్య మా శిబికి ♦ దెల్పెడువారలు లేకబోవుటఁ
భావమునందు జాలిగొని ♦ పాపమటంచును రక్షణంబుకై
పావురముఁ దగఁ తనదు ♦ బ్రక్కన జేరిచి బోయ కిట్లనుఁ
నీవు దినంగ బెట్టెదను ♦ నీ క్షుధదీర ఖగంబు నియ్యకఁ. 301

వ. పూర్వభాగం బిట్లు సూతుండు వచించునంత సాయంకాలమయ్యె.

## పంచచామరము

ప్రదోషకాలకృత్యముల్ సు ♦ భావయుక్తులై మునుల్
ముదంబుతోడ సల్పి వచ్చి ♦ ముందు ముందు జేరగఁ
సదస్సునందు సూతు డంత ♦ సత్వరంబుగా గథఁ
మదిఁ దలంచె నుత్తరంపు ♦ మంతు కెక్కుభాగముఁ. 303

## పంచచామరము

గిరీశ నీ చరిత్రముఁ సు ♦ కీర్తనంబు జేయు నా
మొరాలకించుమయ్య నీ య ♦ మోఘమైన ప్రేమతోఁ
సురక్తినొంది ప్రోవు రామ ♦ జోగయాఖ్య భక్తు నఁ
నిరంతరంబు నిన్ను గొల్తు ♦ నీలకంఠ శంకరా! 304

## గద్యము

ఇతి శ్రీ పార్వతీపరమేశ్వర ప్రసాదపాత్ర
వైదిక బ్రాహ్మణవంశపయఃపారా
వార రాకాసుధాకరాపస్తంబ
సూత్ర కౌశికసగోత్ర పమిడి
రామజోగయ్యాశాస్త్రి
ప్రణీతంబైన శ్రీ కపో
తేశ్వర చరిత్రంబు
నందు బూర్వ
భాగము
సంపూర్ణము

ఏతత్సర్వ మీశ్వరార్పణ మస్తు.

—⁂—

# శ్రీ కపోతేశ్వర చరిత్రము

## ఉత్తర భాగము



శా. శ్రీ కైలాస నివాసివై గిరిసుతా ♦ చిత్తాబ్జభానుండవై
శ్రీ కాశీనిలయుండవై ధరణిలో ♦ జేజెర్లకుఀ జేరియుఀ
నీ కారుణ్యముతోడ భక్తుని దయఀ ♦ నీయండకుఀ జేర్చియుఀ
సాకఀ వచ్చితివయ్య సాంబ! నను నీ ♦ సత్కావ్య సంపూర్తికై. 1

ఉ. పారము జెందగా మదికి ♦ భర్గ రచించితి బూర్వభాగముఀ
మీర లనుగ్రహింపగను ♦ మేదినియందున నింపుసొంపుగఀ
సారయుతంబుగా నిపుడు ♦ సల్పెద నుత్తరభాగముఀ దగఀ
చేరి వినంగ సూతుడు ఋ ♦ షీశ్వరులఀ గని చెప్పె నిట్టులఀ. 2

ఉ. బోయనిగాంచి యా శిబి సు ♦ బోధముగా దెలియంగ నిట్లనుఀ
న్యాయముగాదు బావురము ♦ నాదరిజేరెను బ్రాణభీతితోఀ
సాయముజేతు నంచు మది ♦ జాలగ బల్కితి దాని నిచ్చినఀ
వేయరె నారకంబునను ♦ వీడుము హింసను బాపభీతితోఀ. 3

### భక్తరక్షకుండైన ఈశ్వరు తలంపు

ఉ. శ్యేనకపోతరూపముల ♦ జెల్వుగదాల్చి సురేంద్రవహ్నులుఀ
దానము గోరినఀ శిబియు ♦ ధన్యుడనం చిడె మున్ను కండలఀ
మేనున గోసి యిత్తరిని ♦ మృత్యువు గోరి శిరంబు ద్రుంచగఀ
బూని కపోతరూపమును ♦ బొంది బిడౌజుడు వచ్చె నర్థియై. 4

ఉ. దీనతనొంది వచ్చెనని ♦ దీని యథార్థ మెరుంగలేకయుఀ
గానక నన్ను బోయడని ♦ కార్యము హింసయటంచు నెన్నుచుఀ
దీనిని మానుమంచు దగ ♦ దెంపుగ జెప్పగ బూనినా డహో!
కానిది చెప్పకఀ వినుచు ♦ గాగల కార్యము జూచి బల్కెదఀ. 5

## శిబి బోయల సంవాదము - బోయకు హితవు జెప్పుట

సీ. మాంసభక్షణజేయ ♦ మానుము బోయడ
మృగధర్మ మది నీకు ♦ మేలుగాదు
మాంసభక్షణజేయ ♦ మనుజులు నుండంగ
మృగధర్మ మెట్లౌను ♦ మేదినీశ
మానవుల్ భుజియింప ♦ మంచి ధాన్యములుండ
పులుగును దినుటేల ♦ బోయ నీకు
నలవాటు బడియుంటి ♦ నవనీశ నే నిట్లు
మానగాజాలను ♦ మాంసరుచిని
గీ. పావురంబును నను జేరె ♦ భయమునొంది
దాని నిచ్చుట నా కెట్టి ♦ ధర్మమౌను
భోజనంబును బెట్టెద ♦ బోయ ! దినుము
మానవోచితధర్మంబు ♦ మరువబోకు. 6

సీ. కపటవృత్తిని బొంది ♦ కష్టముల్ బెట్టిన
భువి నపస్మారుడై ♦ బుట్టి తిరుగు
ఘోర హింసలు జేయు ♦ క్రూరచిత్తుండైన
జాతర బలియందు ♦ జావ బుట్టు
సుందరాంగులజూచి ♦ బొంద బాధించిన
షండుడై బుట్టి వి ♦ షణ్ణుడౌను
పరసుఖంబుల జూచి ♦ ధర నోర్వలేకున్న
నధమాధముండునై ♦ యంధుడగును
గీ. మూర్ఖుడై యనృతంబాడ ♦ మూగయౌను
తల్లిదండ్రుల గురువుల ♦ దండనంబు
గుమతియై చేసియుండిన ♦ కుష్ఠుడగును
బోయ! విను పాపఫల మిట్లు ♦ బుట్టజేయు. 7

ఉ. దానము జేయకున్న గడు ♦ దైన్య దరిద్రము నొందు ధారుణిన్
దానను బొందు బాపమును ♦ దానను గష్టము నారకంబునన్
మానని దుఃఖమున్ గలుగు ♦ మారక నిట్టుల జన్మజన్మలన్
మానవు డెప్పుడున్ మరల ♦ మారని దుఃఖి దరిద్రుడౌ జుమీ. 8

కం. పరులకు నుపకారంబును
నరు డెన్నకజేయ శుభము ♦ నయమును బొందుఁ
బరులకు నపకారంబును
నరకమునకు హేతువౌను ♦ నమ్ముము బోయా. 9

సీ. సకలజంతువులందు ♦ జాల దుర్లభమౌను
మానవజన్మంబు ♦ మహిని బోయ!
మానవుండవు నీవు ♦ మానితజ్ఞానివై
మోక్షధర్మము గాంచ ♦ ముఖ్యమౌను
పూర్వజన్మార్జిత ♦ పుణ్యంబుచేతను
ముక్తివిశేషంబు ♦ భక్తుడొందు
భక్తుడవై నీవు ♦ బరమార్థమును బొందు
గురువరేణ్యుండుండు ♦ గుర్తు గనుము
గీ. కులగుణంబుల విద్యల ♦ గొరత బడక
శిష్యవాత్సల్యుడై బోధ ♦ జేయ గురుడు
గురుకటాక్షంబుననె నీకు ♦ ఘోరహింస
మానవౌచితిగాదని ♦ మదికివచ్చు. 10

కం. కులమున గుణమున హీనుని
దిలకింపగ ద్రాగుబోతు ♦ దీర్ఘక్రోధుఁ
పలలము మెక్కెడువానిని
దలచకు గురునిగ గొనుటకు ♦ దగదుర బోయా! 11

కం. స్త్రీలును బెద్దలసేవలు
జాలగ జేయంగవచ్చు ♦ సద్గతికొరకై
స్త్రీలకు గూడదు శిష్యులు
మేలని జేరంగ రాదు ♦ మేదిని బోయా! 12

కం. గురులెవ్వరొ గిరులెవ్వరొ
గురుతెట్టులొ తెలియ నాకు ♦ గొడవగుచుండుఁ
గురులకు గురుడను రాజా!
వరఖగమును ధిండికిమ్ము ♦ వాంఛలు దీరుఁ, 13

సీ. బోయవా డిట్టుల ♦ భూపతితో జెప్ప
మది నది శిబి విని ♦ మథనపడియె
భూతిలో నెయ్యని ♦ బోసినట్లాయెను
మూగతో మాట్లాడి ♦ మురియుటాయె
జెవిటికి శంఖంబు ♦ జెవి నూది నట్లాయె
నంధునకును జూపు ♦ నద్దమాయె
బోయవానికి జెప్ప ♦ బోధయు నటులను
వ్యర్థమై పోయె ని ♦ రర్థకముగ
గీ. చవిటినేలను దున్నించి ♦ జక్కగాను
విత్తనంబును జల్లించ ♦ వృద్ధియగునె
చెప్పి చూచెద నీసారి ♦ శివుని గృపను
బోయ డది విన్న బెట్టెద ♦ భోజనంబు. 14

ఉ. కోరుమ యన్నపానములు ♦ గోరుము గూరలు భక్ష్యభోజ్యముల్
కోరుము బిండివంటలును ♦ గోరుము బచ్చడు లప్పడంబులుఁ
గోరుము నెయ్యి పాల్పెరుగు ♦ గోరుము స్వాదగు షడ్రసంబులుఁ
గూరిమితోడ బెట్టెదను ♦ గోరకు బోయ! కపోతమాంసముఁ. 15

వ. శిబిరాజు మాటలఁ విని బోయ డిట్లనియె. 16

ఉ. ప్రేమ జనించి నేను నిరు ♦ పేదడనైనను భోజనంబుకుఁ
నామది కోరిరాను విను ♦ నా కొకనిశ్చయ మున్నదయ్య నా
కామనమైన భోజనము ♦ గాక మరేమియు నొల్ల నెప్పుడుఁ
నీమము భంగపెట్టకుము ♦ నీ విటు జెప్పుట బాడి యెట్లగుఁ. 17

ఉ. ఐనను కోరు బోయ! తగ ♦ వైన పదార్థము లిచ్చు చొప్పనఁ
దానము జేతు నీకిపుడు దైవముతో ♦ డిది నమ్ము బల్కితిఁ
దీనికి లోటురా దెపుడు ♦ దీనతనొందిన పక్షి దక్కనే
దేని యడుంగు మిచ్చెద హృ ♦ దిస్థిరమంచు శిబీంద్రు డన్నచోఁ,

చం. అనుపమ దానధర్మముల ♦ నర్థుల దన్పిన యట్లు నన్ను నీ
వనితరసత్యవాక్యమున ♦ నాదరముంచి గపోత మెత్తు నీ
తనువున రక్తమాంసములు ♦ ధైర్యము వీడక బావురంబుపై
గనికరమున్న నాకిడుము ♦ గ్రాసముకై ఖగహింస మానెదన్. 19

చం. అనుటకు సంతసించి నృపు ♦ డంత గిరాతునితో ముదంబునన్
గను మిదె తూచి యిత్తు శుభ ♦ కాలము నా కిది యార్తరక్షణం
బనువుగ జేయగల్గితిని ♦ హాయిగ నుండును బావురం బిలన్
తనువుల రాకపోకలకు ♦ ధైర్యము వీడను నేను బోయడా! 20

మ. తులయం దుంచెను బావురం బొక దరిన్♦దూకంబుకై తెచ్చియున్
బలలంబున్ దెగగోసి ఖడ్గమున ♦ భూపాలుండు వేరొక్కటన్
తులితంబున్ సరిజేయ నుంచుచు దగన్ ♦ దూకంబురాకుండినన్
దలయున్ ద్రుంచిన జూచి రా స్థలమునన్♦త్యాగిన్ శిబిన్ సర్వులున్.

మ. నరపాలున్ గృపతోడ సాంబశివుడున్ ♦ నైపుణ్య మొప్పన్ శిబిన్
గరసంస్పర్శముతోడ సాంగతనువున్ ♦ గల్పించె బూర్వాకృతిన్
ధరణీనాథుడు జక్రవర్తి యపుడున్ ♦ దైవోపలబ్ధాంగుడై
పరమానందముతోడ శంకరనుతిన్ ♦ భక్తిన్ దగన్ సల్పగన్. 22

గీ. బోయరూపంబు మారెను ♦ భూతపతియు
బక్షిరూపంబు మారెను ♦ బాకవైరి
శిబినృపుండును సర్వాంగ ♦ సిద్ధి నొందె
శివున కింద్రున కా శిబి ♦ జేసె నతులు. 23

గీ. విధిముకుందులతోగూడి ♦ వేడ్క జెంది
మునులు సురులును దిక్పాల ♦ ముఖ్యు లంత
క్షితిని జేజర్లపురమున ♦ శిబినృపాలు
జేరి జూడంగ శిబిరాజు ♦ జేసె నతులు. 24

గీ. అతుల నతి జేయు శిబిరాజు ♦ నాదరించి
శుభము గలుగంగ దీవించి ♦ సురలు మునులు
సంతసంబున నుండంగ ♦ శంకరుండు
శిబిని గనుగొని దీవించె ♦ చిత్తమలర. 25

చం. వరముల గోరు మిచ్చెదను ♦ వాంఛలుదీర శిబీంద్ర యన్నచో
సరవరు డిట్లు బల్కె శివ! ♦ నమ్మితి మిమ్ముల సమ్మతింపుమీ
స్థిరతర నిశ్చలంబునగు ♦ దెల్వియు భక్తియు గల్గునట్లుగన్
పురహర నాకొసంగి పరి ♦ పూర్ణదయన్ వినుమీ వచించెదన్.

శా. స్వామీ! నీ చరణారవిందయుగ స ♦ త్సాన్నిధ్యమున్ గోరెదన్
నీమంబున్ జెడకుండ నాదుమదిలో ♦ నీ పూజ గాంక్షించెదన్.
గామింతున్ వివిధోపచారములతో ♦ గామేశ నీ సేవలన్
బ్రేమానందశుభస్వభావ కృపతో ♦ బెంపొంద నన్నేలుమీ. 27

సీ. నీ దివ్యమంగళ ♦ నిరుపమరూపంబు
నేడు గంటిని సాంబ ♦ నిజముగాను
అంగజ భస్మాంగ ♦ సంగతశృంగార
దివ్యాంగరాగ సం ♦ దీప్తిగంటి
భుజగరాడ్భూషణ ♦ భూషితంబై యొప్పు
మౌళి బుష్పపుదండ ♦ మంతు గంటి
రంగదభంగ త ♦ రంగ గంగా జటా
జూటంబు ముదమొప్ప ♦ జూడగంటి

గీ. భర్గ నాభాగ్య మేమందు ♦ పావనాంగ
జన్మజన్మంబు లెన్నియో ♦ జరిగి జరిగి
నేడు పుణ్యంబు ఫలియించె ♦ నిర్జరేశ
ఫాలలోచన కృప నేలు ♦ పరమపురుష. 28

చం. కుతలమునందు బుణ్యమును ♦ గొప్పగ నొప్పగ సంతరించియున్
వితరణమందు సాటిగన ♦ విశ్వమునందున లెక్కకొక్కరున్
బ్రతిగనరాని నీవు వర ♦ బాంధవ పుత్రకళత్ర బృందమున్
సతతము గూడియుండి మతి ♦ సక్తముగల్గిన జేరు నాదరిన్. 29

కం. పురహర గజచర్మాంబర
ధర భవహర స్మరహర హర ♦ హర తారకపతి శే
ఖర గిరివరతనయా హృ
త్సరసీరుహమిత్ర గోత్ర ♦ చాప నుతింతుఁ. 30

కం. పరమేశ్వర మీ దర్శన
మురుతరపాపముల బాపు ♦ మూలం బగుటఁ
దరియించితి కరుణింపుము
పరమార్థము బోధజేసి ♦ పాలింపగదే. 31

చం. అను శిబివాక్యముఁ వినుచు ♦ నా హరు డాదర మొప్పగఁ హితం
బును విను బల్కెదఁ దెలియ ♦ భూస్థలియందున బుట్టువారిలో
నెనుబదినాల్గు లక్షలన ♦ నేర్పడు జాతులు నందు లోపలఁ
గనగ జరాచరంబనుచు ♦ గల్గుచునుండును నందు లెక్కకుఁ. 32

చ. ఇరువదియొక్క లక్ష విను ♦ మేర్పడి బుట్టును భూమియందు వి
న్మిరువదియొక్క లక్ష రక ♦ మేర్పడి బుట్టును నీరునందు వి
న్మిరువదియొక్క లక్ష రక ♦ మేర్పడి బుట్టును గ్రుడ్డునందు వి
న్మిరువదియొక్క లక్ష రక ♦ మేర్పడి బుట్టును మావిగప్పియుఁ.

కం. ఇటులఁ నాల్గు తెరంగుల
బటుతరముగ బుట్టుచుండు ♦ భావానుగతం
బెటు లెవరు జేయుచుందురో
యటులను జన్మంబు లెత్తు ♦ నా యా గతులఁ. 34

గీ. అన్నిజన్మల కుండును ♦ నరయ తిండి
నిద్రయు భయమును రతియు ♦ నిక్కముగను
జ్ఞాన మొక్కటి యధికంబు ♦ మానవునకు
నదియులేకున్న బశుతుల్యు ♦ డండ్రు జగతి. 35

గీ. జ్ఞానహీనులు వ్రతములు ♦ దానధర్మ
తీర్థయాత్రలు యాగముల్ ♦ దేవపూజ
లెన్నిసల్పిన జన్మంబు ♦ లెన్నియైన
ముక్తిగాంచరు సర్వంబు ♦ భుక్తికొరకె. 36

గీ. జ్ఞానరత్నంబు జేకొని ♦ మానవుండు
యుక్తకర్మల జేయుచు ♦ యోగ్యముగను
లాభనష్టంబులందున ♦ లోభ ముడిగి
సముడునై యున్న యోగంబు ♦ సఫలమగును. 37

గీ. కర్మవిషయంబు లెవ్వడు ♦ గదలనీక
వానివృత్తులయందు హృ ♦ ద్వాంఛ గల్గి
దలచుచున్నవా డజ్ఞాని ♦ తప్పకుండ
ధరను డాంబికాచారు డా ♦ తం డటంద్రు. 38

గీ. విషయవిజయంబునం దాస్థ ♦ విడువకుండ
శ్రద్ధ గనుగొన్న జ్ఞానంబు ♦ సంగ్రహించు
జ్ఞానవంతుండు శీఘ్రంబు ♦ గాను ముక్తి
పదమునైన శాంతిని బొందు ♦ భద్రముగను. 39

గీ. నిగ్రహేంద్రియ హృద్బుద్ధి ♦ నిష్ఠగల్గి
మౌని మోక్ష మపేక్షించి ♦ మానదగును
గోరిక భయంబు గ్రోధంబు ♦ గూడవనుచు
మానినప్పుడు మోక్షంబు ♦ మౌని గాంచు. 40

గీ. మితముగను దిన దిరిగిన ♦ మేలుకొనిన
బనులను జరుపుచుండియు ♦ న్నను నిదురను
బోవుచుండిన దుఃఖంబు ♦ బొందకుండు
యోగ మబ్బును యోగని ♦ యుక్తహృదయ ! 41

గీ. దైవికంబు గుణమయంబు ♦ దథ్య మిదియు
విడువరానిది నాయొక్క ♦ వేడబంబు
నన్ను నమ్మియు బూజించు ♦ నరులు నిట్టి
మాయను దొలంగి బోగంద్రు ♦ మహిని రాజ! 42

గీ. ఇతరచింతలు లేకుండ ♦ నెట్టినరులు
న న్నుపాసించుచుందురో ♦ నమ్ముచుండి
నట్టి నిత్యాభియుక్తుల ♦ నరసి నేను
క్షేమయోగంబులఁ బూని ♦ జేయుచుందు. 43

గీ. ధర్మములనెల్ల విడనాడి ♦ దైవ మొకడ
నను చు నన్ను శరణమొందు ♦ మఖిలపాప
ముల దొలగింతు నే నీ ♦ కమోఘముగను
దుఃఖ మించుక బొందకు ♦ దొట్రుపడకు. 44

మ. ఘనమై బుద్ధివికాసమై విమలమై ♦ గళ్యాణవాక్యార్థమై
వినుతంబై పరమార్థమై విపులమై ♦ విజ్ఞానదం బైనదై
తనరారన్ వినినాడ శ్రావ్యముగ బో ♦ ధన్ నీవు జేయంగ నా
తనువు న్నేటికి ధన్యమయ్యెనుగదా ♦ దాక్షాయణీనాయకా! 45

వ. అంత న్నిబిన్నృపున కీశ్వరుండు దేవరహస్యముల్ దెలుపుట. 46

చం. పరమదయాసముద్రుడగు ♦ బర్వతరాజతనూజభర్తయున్
నరపతితోడ నిట్లిది వి ♦ నన్ దగువాడవు విన్ము సత్యమున్
సురపతి బావురంబు మరి ♦ సొంపగు డేగయు నగ్నిహోత్రుడున్
నిరుపమ బోయరూపమున ♦ నేనును వచ్చితిమంచు జెప్పియున్.

ఉ. శ్యేనము నూఱుజన్మములు ♦ జేసినవాడని నీదుభక్తికిన్
మానసమందు మెప్పుగని ♦ మారని ప్రేమ జనించి నీయెడన్
కానలలో గపోతమును ♦ గష్టముబెట్టుచునున్న బట్టితిన్
దానిని బుట్టలోనునిచి ♦ దాతవటంచిటు జూడవచ్చితిన్. 48

ఉ. భూతదయాపరుండవగు ♦ భూపతివంచును నిన్నుజేరియున్
భూతలమందు బావురము ♦ బోషణజేయుమటంచు వేడగన్
దాతవుగాన నీ విపుడు ♦ త్యాగముజేసితివయ్య దేహమున్
నీతియు నీమమున్ హృదయ ♦ నిర్మలభావము జెప్ప నొప్పగన్.49

కం. భవహర ! మీరలు ముగ్గురు
బ్రవిమలమూర్తులు భువి కిటు ♦ రా గతమేమో
వివరించుము ♦ గృపతోడను
శివశివ మీకెందు కిట్టి ♦ చిక్కులు గల్గెన్. 50

కం. నారదు సందేశంబున
జేరి దనకు నాకవిభుడు ♦ క్షేమముగోరఁ
మారగు రూపము లొందియు
ధారుణికిఁ వచ్చినాము ♦ ధరణీనాథా. 51

వ. అంత నింద్రుండు మంతనంబున 52

గీ. స్వర్గపతినయ్యు నే నెంత ♦ వ్యర్థుడైతి
భూతపతి నిట్లు శిబినృపుఁ ♦ బుణ్యపురుషు
సర్వవిధముల రక్షించి ♦ సాకుచుండ
రాజ్యకాంక్షయు నన్నెంత ♦ రవ్వజేసె. 53

మ. హరుమాటల్ విని జెప్పె నిట్లు శిబియుఁ ♦ యత్నింప నే నెప్పుడుఁ
సురరాజ్యంబును శూలపాణియనుచుఁ ♦ శుద్ధాంతరంగంబునఁ
నిరతంబుఁ భవదంఘ్రియుగ్మవినుతిఁ ♦ నిష్ఠాగరిష్ఠుండనై
స్థిరసంకల్పముతోడ జేయగ దగఁ ♦ సిద్ధింపగా జేయుమీ. 54

వ. మరియు నీశ్వరుండు శిబినృపున కిట్లనియె. 55

కం. వినుమంటిఁ నామాటను
మనుమంటిఁ భువిని నీవు ♦ మాన్యులు మెచ్చఁ
గనుమంటిఁ గైలాసము
జనుమంటి నిజేచ్ఛగల్గు ♦ సమయమునందుఁ. 56

చం. తనువును వీడినప్పుడును ♦ దానముచేసినగుర్తు గన్పడఁ
గనగ గళేబరంబునను ♦ గల్గును శీర్షము ద్రుంచినట్లుగఁ
వినుతిగ లింగరూపమును ♦ విశ్వమునందున బొందియుండ నీ
కనువుగ గల్గునంచు శివు ♦ డా శిబి నాదరమొప్ప బల్కెనఁ 57

ఉ. నాదుకుటుంబముఁ పరిజ ♦ నంబొకకోటి ననుగ్రహింపుమీ
నీదయగల్గి వారలును ♦ నేనును జేరితిమయ్య యిచ్చటఁ
భేదములేక సచ్చులము ♦ బెంపుగ జన్మమునల్పి మీదరిఁ
మోదమునొందియుండగ న ♦ మోఘకృపఁ గనుమయ్య శంకరా!

కం. నారదు సందేశంబున
జేరి దనకు నాకవిభుడు ♦ క్షేమముగోరఁ
మారగు రూపము లొందియు
ధారుణికిఁ వచ్చినాము ♦ ధరణీనాథా. 51

వ. అంత నింద్రుండు మంతనంబున 52

గీ. స్వర్గపతినయ్యు నే నెంత ♦ వ్యర్థుడైతి
భూతపతి నిట్లు శిబినృపుఁ ♦ బుణ్యపురుషు
సర్వవిధముల రక్షించి ♦ సాకుచుండ
రాజ్యకాంక్షయు నన్నెంత ♦ రవ్వజేసె. 53

మ. హరుమాటల్ విని జెప్పె నిట్లు శిబియుఁ ♦ యత్నింప నే నెప్పుడుఁ
సురరాజ్యంబును శూలపాణియనుచుఁ ♦ శుద్ధాంతరంగంబునఁ
నిరతంబుఁ భవదంఘ్రియుగ్మవినుతిఁ ♦ నిష్ఠాగరిష్ఠుండనై
స్థిరసంకల్పముతోడ జేయగ దగఁ ♦ సిద్ధింపగా జేయుమీ. 54

వ. మరియు నీశ్వరుండు శిబినృపున కిట్లనియె. 55

కం. వినుమంటిఁ నామాటను
మనుమంటిఁ భువిని నీవు ♦ మాన్యులు మెచ్చఁ
గనుమంటిఁ గైలాసము
జనుమంటి నిజేచ్ఛగల్గు ♦ సమయమునందుఁ. 56

చం. తనువును వీడినప్పుడును ♦ దానముచేసినగుర్తు గన్పడఁ
గనగ గళేబరంబునను ♦ గల్గును శీర్షము ద్రుంచినట్లుగఁ
వినుతిగ లింగరూపమును ♦ విశ్వమునందున బొందియుండ నీ
కనువుగ గల్గునంచు శివు ♦ డా శిబి నాదరమొప్ప బల్కెనఁ 57

ఉ. నాదుకుటుంబముఁ పరిజ ♦ నం బొకకోటి నను గ్రహింపుమీ
నీదయగల్గి వారలును ♦ నేనును జేరితిమయ్య యిచ్చటఁ
ఖేదములేక సచ్చ్వలము ♦ బెంపుగ జన్నముసల్పి మీదరిఁ
మోదమునొందియుండగ న ♦ మోఘకృపఁ గనుమయ్య శంకరా!

గీ. శ్రీకపోతేశలింగాభి ♦ షేకజలము
నదియునై బారు నోగేరు ♦ నామ మొంది
క్షితిని గోటప్పకొండకు ♦ జేరు జనుల
స్నానపానార్థమై యొప్పి ♦ సాగిపోవు. 66

గీ. పార్వతీభ్రమరాంబలు ♦ పాణిపీడ
నంబు జేయంగ నమగోరు ♦ యత్నమందు
శ్రీనగంబును జేజర్ల ♦ శీఘ్రముగను
జేరి కళ్యాణ మేటేట ♦ గోరుచుంద్రు. 67

గీ. మునుల కుపకరించు గుహలు ♦ వనము లుండు
స్నానపానార్థమై యొప్పు ♦ స్వాదుజలము
గల్గి చెరువులుఁ గుంటలుఁ ♦ గంజయుక్త
మైన గోనేళ్ళు బావులుఁ ♦ యలరు నిచట. 68

గీ. కనగ జేజర్ల దక్షిణ ♦ కాశి యనగ
దీర్ఘరాజంబు నిదియనఁ ♦ దేజరిల్లు
భక్తు లిచ్చోట బితరులఁ ♦ బార్వణముల
దనుప ముక్తులై దృప్తిగఁ ♦ జనుదు రధిప. 69

చం. విదితముగాగ నీ కిపుడు ♦ వీనుల కింపుగ నింత జెప్పితిఁ
ముదమున గూర్తు నీ కిపుడు ♦ ముఖ్యముగా మదినున్నకోరికఁ
కుదురగు జన్మలందునను ♦ గోమలదేహము గూర్తు గోరుమీ
చెదరనికూర్మి నీయెడల ♦ చేరియునుండగ నిట్లు బల్కితిఁ. 70

శా. నేనా మానవజాతిగోర సురుడఁ ♦ నే గోర యక్షుండనఁ
నేనా కోర ధరామరుండ ననగఁ ♦ నే గోర భూపాలుగాఁ
నేనా కోర విశుండు శూద్రు డనగఁ ♦ నే గోరబో నా వటుఁ
నేనా కోర గృహీవనస్థయతులఁ ♦ నీవౌటకుఁ గోరెదఁ. 71

చం. పనధరుతోడ బల్కు శిబి ♦ వాక్యము లన్నియు సంతసంబునఁ
విని నను గోరినట్టులను ♦ విజ్ఞుడ సత్ఫలమొందు మిద్దరఁ
గను మిది దీర్ఘరాజ మన ♦ గా వెలుగొందుచునుండ మానవుల్
వినుతకపోతలింగమున ♦ వీక్షణజేతురు నిన్ను నన్నుగఁ. 72

శా. నే నీక్షేత్రమునన్ బుధోత్తములకున్ ♦ నీవారశూకంబులన్
నే నెక్కాలము బండుచుండగ దగన్ ♦ నేర్పొప్ప గల్పించెదన్
గానంజాలరు గ్రామవాసు లెలమిన్ ♦ గల్పించు నీధాన్యమున్
వానిన్ భక్షణజేయ దాపసులకున్ ♦ వర్ధిల్లగాజేయుదున్. 73

శా. శ్రీ చేజర్లకు పశ్చిమంబున గనన్ ♦ జెల్వొంది గవ్యూతికిన్
యోచింపన్దగి గోత్రరంధ్ర మలరున్ ♦ యోగీశ్వరావాసమై
వైచిత్ర్యంబుగ నుండు నందు శుభమౌ ♦ వాజంబులున్ గ్రోలగా
దోచున్ స్నానము నాచరింప జనులం ♦ దున్ జేరు పర్వంబులన్.

శా. శ్రీ చేజర్ల కపోతలింగమునకున్ ♦ జెన్నొంది యామ్యంబునన్
దోచున్ మల్లికనామగుండ మనగన్ ♦ దోరంబు దోయంబులన్
రోచిష్ణుండగు స్నానమాడ నచటన్ ♦ రూఢిన్ ననున్ గాంచినన్
భూచక్రంబున బుణ్యవంతుడనగన్ ♦ భూమీశ ! బెంపొందెడున్. 75

కం. కనకమణియుతంబు నలరు
ఘనభూషణరాజితముగ ♦ గల్పించు శిబీ !
వినుతంబగు నిక్షేపము
ననువొందగ నుండ నిచట ♦ నమరులు మెచ్చన్. 76

వ. మరియును 77

ఉ. శ్రీరుచిహేమరత్నముల ♦ జెల్వగు బచ్చల పల్లకీలు సం
స్ఫారములై మహాత్ములకు ♦ జక్కగ గన్పడుచుండు నిచ్చటన్
చోరులు దుష్టకృత్యముల ♦ జొచ్చి గనుంగొన దుర్మదాంధులై
జేరినవారి బట్టి వప ♦ జింత్రు శివాజ్ఞను గాలకింకరుల్. 78

కం. యుగయుగములు నీ గ్రంథము
సొగసై వెలుగొంద రామ ♦ జోగయ కవి నే
నొగి సంరక్షణ జేతును
భగవత్కృతి నిధియు సల్పు ♦ భక్తుం డగుటన్. 79

కం. వినుము శిబీ! తీర్థంబున
గనుగొనగఁ బేరులేని ♦ ఘనవృక్షంబుఁ
జనుటకు దొరటయు గలదై
మను నిలగలి నైదువేలు ♦ మానవవర్షాల్. 80

కం. విను తుంగదుర్తి ♦ బుచ్చయ
యను యోగివరుడు జొరబడు ♦ నా తొరటందుఁ
జని దీర్ఘయాత్ర లాగతి
ననవరతము దిరుగు వృక్ష ♦ మవనిఁ యుండఁ. 81

వ. శిబినృప! కలియుగమునం దైదువేలేండ్లలోపున నీ పేరులేని పెద్ద మానునం దిట్లు విశేషంబు లలరి, రక్తమును స్రవించుచు ధరపై బడి రూపుమాయునని శివుండు వచించెనని సూతుండు మునులకుం జెప్పినఁ వినిరి. మరియునీశ్వరానుగ్రహంబెరింగింతునని యిట్లనియె.

మ. కన జేజర్లను జేరి గోత్ర శిఖరా ♦ గ్రంబందు మేఘాల మల్లేశుడం
చును నామంబుననున్న నన్ను జనులుఁ ♦ క్షోభిల్లు క్షామంబు తో
చ నుతుల్ జేతురు వానకుఁ వరదపా♦శంబుఁ నివేదించుచుఁ
ఘనవర్షంబులు వెంటనే గురియు భ♦క్తాభీష్టముల్ దీరగఁ. 83

మ. హనుమంతుండును తూర్పు నుత్తరమునఁ ♦ వ్యక్తుండగుఁ స్కందుడుఁ
వనజాక్షుండును వీరభద్రుడును శ ♦ ర్వాణీ గణాధ్యక్షులుఁ
ఘన చేజర్ల గపోతదేవుని గుడిఁ ♦ గన్పింతు రామీదటఁ
గన నందీశ్వర మంటపంబునను వి ♦ ఖ్యాతంబు నికేపముఁ. 84

కం. చేరును మా సన్నిధికిఁ
గోరుచు భ్రమరాంబ శివుని ♦ గోవెల లోనఁ
గౌరీశుఁ జేజర్లఁ
ధీరమణునిగా నపేక్ష ♦ దెల్పుచునుండుఁ. 85

చం. పరిజనకోటితో నిచట ♦ బాలనజేయుము చక్రవర్తివై
ధరను శిబీంద్రయంచు రజి ♦ తాద్రివిభుండు వచించు చిట్లనున్
మరియును నీవు సైన్యమును ♦ మానుషదేహము లిచ్చుచొప్పునన్
బరువడి లింగరూప పరి ♦ పాటిని బొందుడు గోటినొక్కసై. 86

చం. సకల సుపర్వులున్ ♦ గలిసి సాంబసదాశివమూర్తి వేడ్కతోన్
ప్రకటనజేసె రాజునకు ♦ రా జిట బ్రస్తుతి జేయుచుండగన్
సుకృతఫలంబు నీదు శిబి ♦ శోభిలజేసెను బోయివత్తు నే
నిక నన స్వామిదర్శనము ♦ నెప్పుడటంచును గోరుచుండెదన్. 87

శా. చేజర్లన్ శిబిరాజునేలి హితమున్ ♦ జేకూర్చి కైలాసమున్
జేజేలందరితోడగూడి భవుడున్ ♦ జేరంగ యత్నించుచున్
భ్రాజిష్ణుండగుచున్ జనార్దనవిధుల్ ♦ రాజింప బార్శ్వద్వయిన్
జేజేగట్టును దాటిపోవు చవలన్ ♦ జేరెన్ నిజాస్థానమున్. 88

చం. శివుని యనుజ్ఞచే జగతి ♦ జీవగణంబులు సంచరిం చనన్
దివమున బాకశాసనుడు ♦ దిక్కు శివుండని జేరె భీతితోన్
భువి శిబిచక్రవర్తియును ♦ బూర్తిగ జేసె శతాశ్వమేధముల్
శివుని యనుగ్రహంబునను ♦ జింతలుదీరి సుఖించి రిద్దరున్. 89

చం. వినుతము సుప్రసిద్ధమును ♦ విశ్వహితంబు గపోతలింగ దే
వుని చరితంబు మర్త్యులకు ♦ వృష్టిగనుంగొన నిష్టసంపదల్
తనియగ వస్తువాహనవి ♦ తానము సుస్థిరభోగభాగ్యముల్
వినిన బఠించ వ్రాసినను ♦ విశ్వమునందున గల్గు నెప్పుడున్. 90

వ. ఇట్లు చంద్రచూడుండు శ్రీచేజెర్ల కపోతేశ్వరు నావిర్భావం బను
గ్రహించెనని సూతపౌరాణికోత్తముండు శౌనకాదిమహాఋషుల
కుద్బోధించె నటు లీ గ్రంథకర్త యాంధ్రంబున బద్యకావ్యంబున్
రచియించె. మరియు 91

## సూతుని ఋషులు సన్మానించుట

పంచచామర వృత్తము

చం. కపోతలింగ దివ్యమూర్తి ♦ గాథజెప్ప మౌనులున్
దపోధనున్ సుపూజ్యు సూతు ♦ దన్పుజేసి రప్పుడున్
సుపోత్ర భూషణాదు లిచ్చి ♦ శోభితాంగు జేయగా
నుపన్యసించి సూతు డంత ♦ నొప్ప జేసె సన్నుతుల్. 92

వ. ఈ కృతి రచయిత గట్టురాచూలిమగనిన్ గొనియాడుట

సుగంధి వృత్తము

శ్రీ కపోతలింగ సాంబ ♦ శిష్టపాల శంకరా
సాకుమయ్య భక్తలోక ♦ సంఘమందు జేర్చి నన్
శ్రీకరంబు నీ పదంబు ♦ జేరి కొల్తు నిత్యమున్
లోకరక్ష నీ పదంబు ♦ లోలుపున్ గృపానిధీ ! 93

సుగంధి వృత్తము

మంగళంబు దేవదేవ ♦ మంగళం బుమాపతీ
మంగళంబు శూలపాణి ♦ మంగళంబు శ్రీగళా
మంగళంబు ఫాలనేత్ర ♦ మంగళంబు భర్గ స
న్మంగళాంగ మంగళంబు ♦ మమ్ము నేలు మీశ్వరా ! 94

సుగంధివృత్తము

వందనంబు పార్వతీశ ♦ వందనంబు ధూర్జటీ
వందనంబు భావజారి ♦ వాసవాదివందితా
వందనంబు దీనపోష ♦ వాంఛితార్థదాయకా
వందనంబు పూర్వదేవ ♦ వైరిమిత్ర ! మ్రొక్కెదన్. 95

మాలినీ వృత్తము

అనుపమశుభగాత్రా ♦ వ్యాఘ్రచర్మాంగవస్త్రా
వనజనయన మైత్రీ ♦ వ్యక్త దివ్యప్రభావా
వినుతఘనచరిత్రా ♦ వేదవేదాంతవేద్యా
చెనటిమతవిభంగా ♦ శ్రీ కపోతేశలింగా. 96

భుజంగప్రయాత వృత్తము

గిరీశామరేశ ప్ర ♦ గేయ ప్రశస్తా
స్మరన్మంగళాకార ♦ సౌందర్యమూర్తీ
పురారీ స్మరారీ సు ♦ పూజ్యాంఘ్రిపద్మా
స్ఫురచ్చంద్రమౌళీ ♦ కపోతేశలింగా ! 97

వనమయూర వృత్తము

సోమధర కామహర ♦ శూలకర సాంబా
క్షేమకర పాపహర ♦ శీతకరమౌళీ
స్వామి వరదానకర ♦ చారుశుభగాత్రా
నామది గపోతవిభు ♦ నమ్మితిర లింగా ! 98

వనమయూర వృత్తము

రాగయుత దైత్యహర ♦ రౌప్యగిరివాసీ
యోగసుఖభోగ్య శివ ♦ యోగిజనవంద్యా
భోగివరభూషణ క ♦ పోతవిభులింగా
రాగదర సాంబశివ ! ♦ రక్షణము జేయన్. 99

పంచచామర వృత్తము

సరోజనాభు డొక్క వెయ్యి ♦ సారసంబులన్ దగన్
బురారి నిన్ను బూజజేయ ♦ బూని తెచ్చి భక్తితోన్
స్మరించి వెయ్యినామముల్ స ♦ మర్చనంబు జేయగన్
హరించి పోయె నందు నొక్క ♦ యబ్జ మప్డు తగ్గగన్
బరేశ నిన్ భజించ నేత్ర ♦ పద్మమీయగా దగన్
బరత్వమొందు విష్ణుమూర్తి ♦ భక్తి కెంతొ మెచ్చుచున్
స్ఫురింప శ్రీ కపోతలింగ ! ♦ భోగభాగ్యలక్ష్మలన్
భరించు మంచు నిచ్చినట్లు ♦ బాలనంబు జేయు నన్. 100

మేఘవిస్ఫూర్జిత వృత్తము

కృపాళో గౌరీవల్లభ ఘనసుధీ ♦ కృత్య విజ్ఞానసారా
కపర్దీ నిత్యంబుఁ నిను గొలిచెదన్ ♦ ఖ్యాతి సత్కీర్తి సంప
త్సుపూర్ణాయుష్యంబుఁ ధనకనక స♦త్పూనులుఁ గల్గియుండన్
ప్రపంచాతీతాఖండసుఖ మిడగఁ ♦ రా కపోతేశలింగా ! 101

మేఘవిస్ఫూర్జిత వృత్తము

పరంధామా మృత్యుంజయ గిరిశ స♦ద్భక్తదుఃఖాబ్ధినౌకా
విరాజద్భోగీంద్రాభరణధర యో ♦ విశ్వమందారభూజా
మురారిబ్రహ్మేంద్రామరవరద స♦న్మోక్షసామ్రాజ్యలక్ష్మీ
స్థిరేశా శ్రీకంతా కరుణఁగనరా ♦ శ్రీ కపోతేశలింగా ! 102

మత్తకోకిల వృత్తము

శూరపద్ముడు సింహవక్త్రుడు ♦ సోదరుల్ మరి వీరికిన్
తారకుం డనుజన్ముడంచును ♦ దానవుల్ గడు పాపులై
మేరలేకను సాంబ ! వారలు ♦ మీరి గంజజునండముల్
ఘోరబాధలుబెట్టు మువ్వురి ♦ గూల్చ బంపవె నీ సుతున్. 103

వసంతతిలక వృత్తము

చేజర్ల జేరి శిబి ♦ జేయ శతాశ్వమేధాల్
జేజేలరేడు తన ♦ చేటదనంగ నీతో
నాజిష్ణు గాచి శిబి ♦ కాశ్రయమిచ్చి శంభూ
రాజిల్లజేయు దయ ♦ రమ్ము కపోతలింగా ! 104

విద్యున్మాలా వృత్తము

నేరంబేమీ ♦ నీలగ్రీవా
భారంబయ్యా ♦ భావాతీతా
కారుణ్యం బా ♦ కాంక్షింతున్ నీ
పేరుండున్ నన్ ♦ ప్రేమించంగన్. 105

విద్యున్మాలా వృత్తము

నీకుఁ బూజల్ ♦ నే గల్పింతుఁ
సాకఁ రారా ♦ శర్వాణీశా
వ్యాకోచంబై ♦ వ్యాప్తిఁ గాంచఁ
నీకీర్తిఁ సన్ని ♦ ష్ఠఁ గొల్తుఁ. 106

మంగళమహాశ్రీ వృత్తము

ఆయువును లోకమున ♦ నల్పమని
మృత్యుజయమొందను మృకండసుత మార్కం
డేయుడను భూసురుడు ♦ డెందమున
భర్గ నిను బూజన మనర్గళము జేయఁ
జేయునదిలే దికను ♦ జీవమును
దీతునని గాలు డురుపాశము దగల్పఁ
హాయిగన విప్రునకు ♦ నాయు విడి
కాలుని యురంబు శివ ! తన్నితివి కూలఁ. 107

మంగళమహాశ్రీ వృత్తము

కాలు డవివేకమున ♦ గర్వమును
బొంది శివభక్తిఘనదీక్షితు డటంచుఁ
బాలకుని గన్గొనక ♦ బాధలను
పెట్టె నిక నీతని సజీవునిగ జేయఁ
చాల భయభక్తులను ♦ సాంబ నిను
గొల్చునని చెప్పినను విష్ణువిధిముఖ్యుల్
గోలుకొన బ్రాణమును ♦ గూర్చితివి
దండధర నన్నెరుగు మంచనుచు శంభూ ! 108

మంగళమహాశ్రీ వృత్తము

దారువనమందు ముని ♦ దారలు ని
నుఁ గనియు మోహమున వెంటబడి రాగఁ
వారణము దాపసులు ♦ వారలను
గూర్చ నొనరించియు నిరర్థకులు నౌచుఁ

క్రూరమగు శాపమున ♦ ఘోరముగ
మీపురుషచిహ్నమును రాలిపడ దిట్టఁ
మీ రనుమతించియును ♦ మే లికను
లింగమున బూజలిడ గల్గనవె శంభూ! 109

ఉత్సాహ వృత్తము

కనుగొనగను బోయవాడు ♦ గహనమున మృగవధకై
జని నిరాశను దినము నిశి ♦ జరిగి నిరశనుడగుటఁ
ఘనమగు శివరాత్రి నాడు ♦ గల్గుటవలన దురితుం
డనక భిల్లుని యమబాధ ♦ లణచి బ్రోచితివిశివా ! 110

ఉత్సాహ వృత్తము

హర! భవహర! హిమగిరి తన ♦ యాహృదయజలరుహ భా
స్కర! పురహర! మదగజదను ♦ జాజిన వసనధర ! శ్రీ
కర ! దినకర సోమపావ ♦ కనయన ! దురితహర ! భూ
సురవరద! నుతజగదవన ! ♦ సురగణ వినుతచరణా ! 111

ఉత్సాహ వృత్తము

శ్రీ కపోతలింగ ! శ్రీ గి ♦ రీశ చంద్రశేఖరా
లోకపాల సామగాన ♦ లోల నన్ను నేలరా
ప్రాకటంబుగాను నీదు ♦ పాదపద్మ పూజలఁ
శ్రీకరం బటంచు జేతు ♦ రేపు మాపు నెమ్మదిఁ. 112

ఉత్సాహ వృత్తము

తల్లిరాను శక్తిలేదు ♦ దాతవంచు బొగడ జే
జర్లలో గపోతలింగ ♦ సాంబ చండికాపతీ!
పాల్లి నీకృపామృతంబు ♦ బొంగిరాగ నాదరిఁ
బొర్లు చార లెన్నొ జుట్టి ♦ బొట్టనిండ ద్రాగెదఁ. 113

ఉత్సాహ వృత్తము

లోకసృష్టి లోకపాల ♦ లోకసంహరంబులున్
నీకు లీలలంచు దేవ ♦ నిర్మలాత్మ మ్రొక్కెదన్
శ్రీ కపోతలింగ చంద్ర ♦ శేఖరా గిరీశ్వరా !
యీ కృతిన్ సమర్పణంబు ♦ నిత్తు గొన్ము మాపతీ. 114

ఉత్సాహ వృత్తము

భానుచంద్రు లుండుదనుక ♦ భాసిలంగ నీకృతిన్
భానుచంద్రవహ్నినయన ♦ భక్తి ముక్తిదాయకం
బైన దెచునుండ బ్రోవు ♦ మయ్య సాంబ ! నిత్యమై
ధ్యానయోగ్యమై ముదావ ♦ హంబునై జెలంగగన్. 115

ద్రుతవిలంబిత వృత్తము

భుజగభూషణ ♦ భూషితభాసురం
గ జగతిన్ కృతి ♦ కన్యకయున్ పతిన్
నిజమనంబున ♦ నిన్ శివ ! గోరె న
య్య జనసమ్మతి ♦ హాయిగ గొన్మికన్. 116

దండక వృత్తము

శ్రీ సచ్చిదానందరూపంబు బ్రహ్మం బఖండం బనాద్యంతశూన్యం బతర్క్యం బశోష్యం బదాహ్యం బభేద్యం బచింత్యం బవాఙ్మానసాతీత మద్వైత మేకంబు పూర్ణంబు నైర్గుణ్య మైయుండు నిత్యంబు సత్యంబు సర్వంబు తానైన బ్రహ్మపరోక్షంబునొందంగ సాకారమౌ నిన్ను నే గొల్తు శ్రీపార్వతీహృన్నిజాంతర్విహారా రమాభర్తసంస్తుత్యనామప్రశస్తా శివానంద మూర్తీ గుణాతీతవర్తీ విశుద్ధాంతరంగా స్థిరామర్త్యపుత్రాయురారోగ్య భాగ్యంబులన్ గూర్చు కారుణ్యభావంబునన్ బ్రోవు మోశూలి బ్రహ్మేంద్ర ముఖ్యామరశ్రేణికోటీరరత్నద్యుతుల్ పాదపంకేజముల్ దాకుచుండంగ మ్రొక్కంగ దీవించి సౌఖ్యంబులన్ గూర్చు సద్భావ భక్తార్తివిధ్వంస వర్ణాశ్రమాచారధర్మంబులన్ దెల్పు వేదంబులన్ శాస్త్రజాలంబులన్ మానవౌచిత్యపూజ్యంబులౌకర్మ లందందు బోధించుకాండంబు జీవేశ్వ

రోపాసనంబుండు కాండంబునుఁ దెల్పుమార్గంబు వేదాంతవిజ్ఞానకాండం
బనఁ మూడుభాగంబులఁ నిన్ను సేవించుచుండంగ బంధంబులఁ
ద్రుంచి పాపంబులఁ నాశ మొందించి రోగంబులఁ మాన్పి భూతంబులఁ
యక్షరక్షఃపిశాచంబులఁ శాకినీ ఢాకినీ ఖేచరీ భూచరీ భూత భేతాళ
మారీ మహామారులఁ బ్రహ్మరక్షోగ్ర ఘోరప్రయోగంబులఁ గాలి
దయ్యంబులఁ బట్టి దూరంబుగఁ గొట్టుచుఁ ద్రుంచుచుఁ బుద్ధి
జాడ్యంబులఁ మాన్పి సద్బుద్ధులఁ గూర్చి రక్షింతు వోస్వామి శూన్యంబు
బోధించి దైవంబు లేడంచు వాదించుదుష్టాత్ములఁ గష్టనష్టంబులొందంగ
స్పష్టంబుగా నీచజన్మంబులఁ గర్మలఁ బట్టి పుట్టించి సంసారవార్ధిఁ
బడఁగొట్టి దిక్కెందు గానంగలేకుండ దుఃఖించుచుఁ జచ్చుచుఁ
బుట్టుచుఁ జాలకాలంబునందుండి యెట్లెట్లొ జన్మాంతరోత్కృష్ట
పుణ్యంబు సాఫల్యమై రాగ నాస్తిక్యభావంబునఁ వేదశాస్త్రానుసారంబు
వర్తించుచుఁ నీదయఁ గాంచగా గోరి నిష్కాములైయున్నవారిఁ గృపఁ
జూతు వోయయ్య ముక్తాపరాగాద్రితుల్యాంగరాగానుషంగంబునందుండి
నఁ బ్రోవు మోసాంబ శ్రీమత్కపోతేశలింగా ! నమస్తే నమస్తే నమస్తే
నమః. 117

పాదప వృత్తము

ఉత్తర భాగము ♦ నొప్పగ సూతుం
డుత్తమమౌనుల ♦ కోజను జెప్పం
గిత్తరి దెల్గున ♦ నీశ్వర ! నీవుఁ
జిత్తమునఁ విన ♦ జెప్పితి బేర్మిఁ. 118

ఇంద్రవజ్ర వృత్తము

నేనౌఁ భవానీపతి ♦ నీవు బుద్ధి
స్థాన ప్రతిచ్ఛాయ ని ♦ జంబు జీవుం
డౌనంచు సాటిఁ మతి ♦ కద్దమంచుఁ
బూనుంటి చేజర్ల క ♦ పోతలింగా ! 119

ఇంద్రవజ్రా వృత్తము

ధీనాశమైనన్ బ్రతి ♦ దృశ్యనాశం
బైనట్లు నెట్లన్నపు ♦ డద్దమంతం
బైనప్డు బ్రత్యాకృతి ♦ యంతమౌచున్
బోనయ్యె చేజర్ల క ♦ పోతలింగా! 120

ఇంద్రవజ్రము

నీచాశ్రయంబున్ గడు ♦ నీచమంచున్
యాచించితిన్ దేవ మ ♦ హాశ్రయున్ నిన్
నీ చిత్తమంచున్ నిను ♦ నెమ్మి గొల్తున్
బ్రోచంగ జేజర్ల క ♦ పోతలింగా! 121

ఇంద్రవజ్రము

హేమాద్రిబాణాసన ♦ హృష్టిరూపా
కామేశ శూలీ శ్రుతి ♦ గానలోలా
నామస్తుతుల్ జేతు వి ♦ నంగ రా శం
భూమేశ చేజర్ల క ♦ పోతలింగా! 122

ఇంద్రవజ్రము

కుందేందుధావళ్య సు ♦ కోమలాంగా
వందారుబృందారక ♦ వాంఛితార్థా
సౌందర్యగాత్రా నను ♦ సంతసంబున్
బొందించు చేజర్ల క ♦ పోతలింగా! 123

ఇంద్రవజ్రము

దీనుల్ దయాళూ క్షితి ♦ దేవపాలా
దానార్థుడన్ నేన్ బహు ♦ ధర్మదాతా
సానందభావా కలి ♦ జన్మబంధాల్
బోనెంచు చేజర్ల క ♦ పోతలింగా ! 124

ఇంద్రవజ్రము

మందారపుష్పార్చిత ♦ మందహాసా
నందీశ్వరారూఢ పి ♦ నాకహస్తా
ముందిందురారా శివ ♦ మోదముల్ నే
న్పొందంగ చేజర్ల క ♦ పోతలింగా ! 125

ఇంద్రవజ్రము

భూతిప్రదాతాద్భుత ♦ భోగిహారా
భూతార్తివిధ్వంస సు ♦ పుణ్యమూర్తీ
మాతాపితా దైవము ♦ మాకు నీవే
భూతేశ చేజర్ల క ♦ పోతలింగా ! 126

ఇంద్రవజ్రము

ద్వేషించు దుష్టాత్ముల ♦ దిక్కు గాంచన్
భూషింతురా నిన్ బహు ♦ పుణ్యమూర్తీ
భాషింపుమయ్యా నను ♦ భక్తుడంచున్
బోషించు చేజర్ల క ♦ పోతలింగా ! 127

ఇంద్రవజ్రము

రారా మృడానీశ ప ♦ రాత్పరేశా
రారా కృపాసింధు కు ♦ రంగపాణీ
రారా శుభాకార వ ♦ రార్థివాంఛల్
పూరించు చేజర్ల క ♦ పోతలింగా ! 128

గీర్వాణభాషాస్తుతి

వనజోదరవనజోద్భవనుతవందిత చరణా !
వినయోజ్జ్వల వృషవాహన ! ఫణిభూషణ ! సతతం
జనితశ్రమహరణం కురు పరమేశ్వర ! హర ! మే
మనసిస్థితవరవాంఛితఫలదాయక ! కృపయా. 129

## గ ద్య ము

ఇతి శ్రీ పార్వతీ పరమేశ్వర ప్రసాద
పాత్ర వైదిక బ్రాహ్మణ వంశపయః
పారావారరాకాసుధాకరాపస్తంబ
సూత్ర కౌశికసగోత్ర పమిడి
సుబ్బయ్యశాస్త్రి పుత్ర
రామజోగయ్యశాస్త్రి
ప్రణీతంబైన శ్రీ
కపోతేశ్వర చరి
త్రంబునం
దుత్తరభాగము
సంపూర్ణము.

ఏతత్సర్వ మీశ్వరార్పణమస్తు.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 19 | భువవన | భువన |
| | | భవన | భవవన |
| 16 | 10 | గ్రస్తమౌ | గ్రస్తమౌ |
| 19 | 8 | మందిరార్గట్టి | మందిరాల్గట్టి |
| 21 | 21 | వేడదన్ | వేడెదన్ |
| 22 | 18 | కొండవేరుల | కొండలేరులు |
| 32 | 7 | ముపార్థించు | ముపార్జించు |
| 34 | 17 | జెపుదుల్ | జెపుదున్ |
| 35 | 5 | నింద్రుండు | నింద్రుడు |
| 38 | 10 | లెచ్చెదున్ | లిచ్చెదున్ |
| 43 | 14 | నమాన | సమాన |
| 47 | 28 | జాపు | జావు |
| 57 | 17 | బాపురము | బావురము |
| 58 | 23 | శ్యేనభాధను | శ్యేనబాధను |
| 61 | 13 | దాయన్ గాడు | దాయన్ గాదు |
| 62 | 10 | రాకసుధా | రాకాసుధా |
| 64 | 20 | విషణ్డు | విషణ్ణు |